# ప్రకృతి కానుక
# ప్రతి ఒక్కరికి.
# కోమల,యవ్వన
# ఛాయ సర్వాంగాలకి

పోర్చుగీస్‌లో వేప పేరు మార్గోసా. వివిధ రూపాల్లో వేప దేహానికి, చర్మానికి చేసే విశేషమైన మేలుకు తిరుగులేదు. అందుకే తరతరాలుగా వేప అన్న అంత ఆదరణ.

మార్గో సబ్బు ఒక్కటిలోనే అధిక భాగం వేపనూనె వుంది. శుద్ధమైన, సహజసిద్ధమైన మార్గో సబ్బు శరీరాన్ని పరిశుభ్రంగా నుంచి అంగాలన్నిటి చర్మాన్ని సంరక్షిస్తుంది.

ప్రకృతికి తరలండి. మార్గోతో స్నానం చెయ్యండి. మీరు ప్రతిసారి స్నానం చేసేక మీ శరీరమంతా పరిశుభ్రంగా, తాజాగా, మెరుస్తూ వుంటుంది.

## శరీరమంతా పరిశుభ్రం
## తల్లిలా చేసే సంరక్షణ




## మార్గో—స్వచ్ఛమైన వేప నూనెతో
## ప్రత్యేకంగా చర్మ సంరక్షణకై చేయబడిన సబ్బు

కాల్‌కెమికో వారి ఉత్పాదన నాణ్యతకై చూసి వాడేవారికి.

CCC/4000 Tel

**విమల్‌వారి విశిష్ట ఉత్పాదన**

# ఎస్‌క్లూజివ్ సూట్‌లెంగ్త్స్

సూటింగ్స్‌లో ఎన్నో ఉన్నత
ప్రమాణాలు నెలకొల్పిన విమల్
సూటింగ్స్‌వారి అసామాన్య సృష్టి.




**మంగళ్‌దీప్**

కోఠీ, హైదరాబాద్, ఫోన్ : 45786

ఆంధ్ర ప్రదేశ్‌లో అన్నిటికన్నా పెద్దదైన విమల్ షోరూం

ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం : 1908
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
[1938–1972]
శుక్రవారం : 27–5–'83
రుధిరోద్గారి నామ సం. వైశాఖ బ. పాడ్యమి
సంపుటము 75 సంచిక 39
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 1-50 |
| ఆరు మాసాల చందా | రు. 42.90 |
| పోస్టులో ఏడాది చందా | రు. 85.80 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం. విజయవాడ-520 003.

## విషయానుక్రమణిక



## ఊమెన్ కార్టూన్

29–4–83 వారపత్రిక చాలా బావుంది. ఊమెన్‌గారి ''లోకంపోకడ'' కార్టూన్లు చాలా బావున్నాయి. ప్రస్తుత రాజకీయాలకి తగినట్టుగా వేస్తున్నారు.

యం. డి. రాజ్ మహమ్మద్ (ముదిమాణిక్యం)

## న్యూఢిల్లీ లేఖ

29–4–83నాటి 'ఆంధ్రసచిత్రవారపత్రిక' ముఖచిత్రం ఎంతో శోభాయమానంగా, సర్వాంగసుందరంగా తీర్చిదిద్దారు. 'న్యూఢిల్లీ లేఖ'లో నేటి భారతీయులపై అరబ్బుల ప్రభావాన్ని చాలా చక్కగా వివరించారు. 'జయదుబాషీగారికి' నా ధన్యవాదాలు.

కొమ్మినేని శ్రీనివాసరావు (గుంటూరు)

## ప్రేమే నేరమా ?

యువకులు యువతులు కథలు, నవలలు చదివినా, సినిమాలు చూచినా అందులోని హీరో, హీరోయిన్‌లను అనుకరిస్తారు. అదీ చాలావరకు వేషధారణల్లో, చిలిపి పనుల్లో మాత్రమే !

కాని 'ప్రేమే నేరమా' కథలోని హీరో మూర్తి లాంటివారిగా మారుదామని ఆలోచించరు. సాధారణంగా నేటి మానవులు ఇతరులకు బాధాకరంగానే తప్ప వారి బాధ తొలగించేవారిగా ఉండడంలేదు. చక్కని కథని ప్రచురించినందుకు థాంక్స్.

బిందు (జనగాం)

## ముగింపు బాగుంది

22–4–83 ఆంధ్ర సచిత్ర వారపత్రిక ముఖచిత్రం చాలా బావుంది. జీవితసమరం ముగింపు బావుంది.

ఐ. శైలజ, ఎ. పద్మజ (దువ్వ)

## ప్రస్తుత సమస్యలు !

29–4–'83 వార పత్రిక మూడు ప్రేమ కథలు, ఒక వృద్ధాప్యం కథ చదివాను. వాటిలో 'పొగమంచు' కథావస్తువు–ప్రేమ, పెద్దల అంగీకారం, సుఖాంతం. లాజిక్ – ప్రేమ, కాసేపు అపార్థం, సుఖాంతం. ప్రేమ నేరమా – ప్రేమ, పెద్దల అభ్యంతరం, దుఃఖాంతం.

అలాగే పాత చొక్కా–వృద్ధాప్యంలో ఎదురయ్యే బాధలకు సంబంధించినది. ఈ వృద్ధాప్యంలో బాధల మీద ఇప్పటికే వారపత్రికలోనే కొన్ని కథలు వచ్చాయి.

ప్రస్తుత సమాజంలో ప్రజలను పట్టి పీడిస్తున్న సమస్యలను కథావస్తువులుగా తీసుకోవాలని కథలు వ్రాసేవారికి మనవి.

శ్రీమతి పరాగిత్ (రాయచోటి)

## లోకంపోకడ * ఊమెన్












# ఉత్తరాలు

## పొగమంచు

29-4-83 నాటి ఆంధ్రసచిత్ర వారపత్రిక ముఖచిత్రం ముగ్ధమనోహరంగా వుంది. ఈ సారి ప్రచురించిన కథలలో కుందుర్తి ఇందిరాదేవిగారి "పొగమంచు" చక్కని రచనా శైలిలో విలువైన ఇతివృత్తాన్ని కలిగివుంది.

కొమ్మినేని ప్రసాద్ (గుంటూరు)

## ఆకట్టుకుంది

29-4-83 వారపత్రిక ముఖచిత్రం ఆకర్షణీయంగావుంది. సీరియల్స్ ఒకదానికి ఒకటి పోటీగా వుంటున్నాయి. కొత్త సీరియల్ "తిరుచరణాలు" మొదట్లోనే మమ్మ ఆకట్టుకుంది.

ఎం. లలితా నాగేశ్వరరావు (బైపల్లి)

## తిరుచరణాలు

29-4-83 ఆంధ్ర సచిత్ర వారపత్రికలోని "తిరుచరణాలు" కొత్త సీరియల్ చాలా ఆకర్షణీయంగా ఉంది.

బి. యస్. ఎన్. కుమార్ (భీమవరం)

## డా. వెంకటేశ్వరరావు

29-4-83 గల మన వారపత్రికను చూచి చాలా మురిసిపోయాము. అంటే! 'వ్యక్తిగతం'లో మా అభిమాన డాక్టర్‌గారైన శ్రీ కె. వెంకటేశ్వరరావుగారి ఫొటోను మీరు యిన్నాళ్ళకు ప్రచురించినందుకు మాకు ఎంతో ఆనందమైనది. డాక్టరుగారికి వారి సేవలను గుర్తించి విశ్వవిద్యాలయం వారికి పిహెచ్. డి.ని ప్రదానం చేసినందుకు మాకు ఆనందంగావుంది. డాక్టరుగారు పత్రికాముఖంగాను, స్వయంగాను, వైద్య సలహాలనిస్తూ, వైద్యాన్ని చేపట్టి ప్రజల, పాఠకుల మన్ననలు పొందుతూ మరెన్నో డిగ్రీలనుపొంది చిరంజీవులై వుండాలని మా కోరిక.

షేక్ మస్తాను, బేగం, గాలిబీబి.

(ముమ్మలనేనివారిపాలెం, రేపల్లె)

## ప్రేమే నేరమా ?

29-4-83 నాటి ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగావుంది. ఈ వారము వెలువడిన కథలులో ముఖ్యంగా "ప్రేమే నేరమా" కథ చాలా బావుంది. అందంగా, ఆకర్షణీయంగా, ప్రశాంతంగా, నిర్మలంగావున్న కరుణ ఎంత హీనస్థితికి వచ్చిందో చదువుతుంటె కన్నీళ్లు ఆగలేదంటే నమ్మండి. మూర్తి పాత్రను చాలా చక్కగా మలచిన రచయితకి అభినందనలు.

చింతకింది శంకర్ (బొంబాయి) ★

5 కిలోల బరువుగల పుస్తకాలను స్కూలుకు మోసు కెళ్ళటం ఒక్కటే ఈనాడు పిల్లలకు అతి తేలిక పనిగా కనబడుతోంది.



# ఈరోజుల్లో పిల్లల జీవితాలు కూడా కఠినంగా తయారయ్యాయి.

అందుచేత మీ పిల్లలకు ఉత్తమమైనవి లభించాలి.
దీనికోసమే వారికోసం తయారైంది బూస్ట్
మీ పిల్లలకు ఉదయమే ఒక కప్పు రుచికరమైన బూస్ట్ ఇవ్వండి. రోజంతా అత్యంత ఉత్సాహంగా, చురుగ్గా పని చేసేందుకు కావలసిన శక్తి ఇంధనం వారికి లభిస్తుంది. ఎందుచేతనంటే, బూస్ట్ అతి నాణ్యమైన పదార్థాల మేలి మిశ్రమంతో నిండి ఉంది- మీగడ పాలు, గోధుమ, బార్లీమాల్ట్, కోకో.




**చురుకైన జీవనానికి శక్తినిచ్చే ఇంధనం**

# సామాన్యులు అట్టడుగుకి పోవడమే ఆధునికీకరణా?!




తన దగ్గర 20 మిలియన్ల డాలర్ల డబ్బు ఉన్నదని దానిని భారతదేశానికి తీసుకొచ్చి ఢిల్లీ క్లాత్ మిల్స్, ఎస్కార్ట్సులాంటి పెద్ద సంస్థలలో వాటాలు కొనుక్కొని అవి ఇప్పటి కన్నా సమర్థవంతంగా పని చేసేటట్లు చేసి, ఎక్కువ లాభాలు సంపాదిస్తానని చెప్పుకుంటున్న ఈ స్వరాజ్ పాల్ ఎవరు ? ఇటీవల వార్తల్లోను, శ్రీమతి గాంధీ, ఆమె కుమారుని పక్కన ఫొటోలలో తరచు కన్పిస్తున్నారాయన. ఈయనను తనవద్ద 2 కోట్ల రూపాయలు ఉన్నాయని, ఆ డబ్బును పేదల నిమిత్తం కర్చుచేస్తానని చెప్పుకొంటున్న అబ్దుల్ రెహమాన్ అంతూలేను ఏ విధంగా తొలగించారో ఆ విధంగా తొలగించాలి. కాని స్వరాజ్ పాల్ వేరే తరహా మనిషి, అతని మనసులోని ఊహలుకూడా భిన్నమైనవే !

కొత్త హార్వర్డ్ మేనేజర్లతోను, ఐ.బి.ఎం., కంప్యూటర్లతోను ఈ స్వరాజ్ పాల్ 'బారా హిందూరావు'కు వచ్చి ఢిల్లీ క్లాత్ మిల్స్ని కొంటాడే అనుకుందాం. అప్పుడు లాలా శ్రీరామ్ను డైరెక్టర్ల బోర్డులోంచి తొలగిస్తాడు. డా. భరత్ రామ్, డా. చరత్ రామ్లతో మీరు ఇక ఇంటికి వెళ్ళొచ్చని చెప్పి, వారి మోటారుకార్లను అమ్మేసి, డ్రైవర్లను పనిలోనించి తొలగించి సీనియర్ మేనేజర్లతోకూడ తమ తమ ఇండ్లకు వెళ్లవచ్చని చెప్తాడు. అక్కడ యంత్రాలన్నీ చాల పాతవయినాయని వాటిని చెత్తక్రింద అమ్మెయ్యమని కొత్త డైరెక్టర్లతో చెప్పి, లేబరు కాలనీలకు వెళ్ళి అక్కడి డి. సి. ఎమ్. కార్మికులతో ఇక మీకు పనిలేదు — మీ రేషన్ షాపులు సంక్షేమ కేంద్రాలు మూసివేయవచ్చు అని చెపుతాడు. సరికొత్త మగ్గాలు కొని అతి నాజూకైన సింథటిక్ బట్టలనే ఉత్పత్తి చేస్తాడు. ఏ ముతక బట్టలని ఉత్పత్తి చేస్తూ డి. సి. ఎమ్. పేరు ప్రఖ్యాతులు గడించిందో అలాంటి బట్టలు మార్కెట్లోనే కనిపించకుండాపోతాయి. ఒక సంవత్సరంలో డి. సి. ఎమ్. అత్యంత ఆకర్షణీయమైన షోరూములతో దేశమంతా వెల్లివిరుస్తుంది. అధిక లాభాలు గడిస్తుంది. స్వరాజ్ పాల్కు రాష్ట్రపతి నుండి భారత రత్న అవార్డు వస్తుంది. ఆ తర్వాత బొంబాయికి వెళ్ళి టాటా కంపెనీని కూడ కొనెయ్యాలని నిశ్చయించుకుంటాడు.

ఇవన్నీ జరిగే కాలంలో బారా హిందూ రావు రోడ్లల్లోను, సందుల్లోను పరిస్థితి ఏమిటి? 30 వేల మంది కార్మికులు నిరుద్యోగులై, వారి కుటుంబాలు రోడ్డున పడతాయి. వారి తల్లి, తండ్రులు, పిల్లలు పిచ్చాసుపత్రి పాలవుతారు. స్కూళ్లు, రేషన్ షాపులు మూసివేయబడతాయి. తిరుగులేకుండా జరిగే వ్యాపారం కుదువ వ్యాపారం ఒక్కటే. రాజస్థాన్, తదితర రాష్ట్రాలలో ఇంతకు ముందు డి. సి. ఎమ్. లో ఉత్పత్తి అయ్యే చౌక బట్టలు దొరికే చోట ఇప్పుడు సాధారణ ప్రజానీకానికి అందుబాటులో లేని అతి ఖరీదయిన సింథెటిక్ వస్త్రాలే లభ్యమవుతాయి. ప్రతి నాలుగు రోజులకు ఒకసారి అల్లర్లు, పోలీసు కాల్పులు జరుగుతాయి.

నేనేమయినా అతిశయోక్తిగా మాట్లాడుతున్నానా ? థాచర్ పాలనలో ఉన్న ఇంగ్లాండు, రీగన్ పాలనలోని అమెరికాను తీసుకోండి. 30 లక్షల మంది కన్నా ఎక్కువ మంది నిరుద్యోగంతో బాధపడుతున్నారు. స్కూలు చదువులు పూర్తయిన వారు ఉద్యోగాల కోసం పడిగాపులు కాస్తున్నారు. వీరంతా నినాదాలు చేస్తూ గ్లాస్గో నుంచి లండన్కు పాదయాత్ర చేస్తున్నారు. ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అత్యంత ధనవంతమైన న్యూయార్క్ పట్టణంలో పేదప్రజలు నివసించే పాత గోదాములలో వారిని తరిమివేసి నిరుద్యోగులు నివాసం ఏర్పరుచుకుంటున్నారు. పాశ్చాత్యదేశాలు వెనుకటి డార్విన్ కాలానికి దిగజారాయి. వారి నాయకులు ఆధునికీకరణలో నిమగ్నమై ఉండగా వేరు పురుగడకోసం కొట్టుకు చస్తున్నారు.

స్వరాజ్ పాల్



అసలు ఆధునికీకరణ అంటే ఏమిటి ? ప్రతి ఒక్క సంస్థ సమర్థవంతంగానే ఉండాలా? అంటే సమర్థులు తప్ప మామూలు ప్రజానీకానికి జీవించే హక్కు లేదా ? బలవంతులే నివసించి, బలహీనులు అట్టడుగుకి పోవాలా ? ఇదే ఆధునికీకరణా? అలా ఉంటేనే దేశం పురోభివృద్ధి చెందినట్లా ? కాని హిందూ ధర్మం దీనికి ఒప్పుకోదు. డార్విన్ సిద్ధాంతానుసరించి నడిచిన హిట్లరును మార్గదర్శకునిగా తీసుకొనే థాచర్, రీగన్లకే అది వర్తిస్తుంది. హిందూ ధర్మ శాస్త్రం ప్రకారం ధనికులకు, పేదలకు, బలవంతులకు, బలహీనులకు; అందమైనవారికి అనాకారులకు, తెలివైనవారికి, అమాయకులకు జీవించడానికి సమాన హక్కు ఉంది.

డి.సి.ఎమ్., టిస్కోలు పెద్ద సమర్థవంతమైనవి కాకపోయినా సమాజానికి వ్యతిరేకంగా లేనంత కాలం జీవించడానికి, అభివృద్ధి చెందడానికి, ఇంగ్లాండులోని స్వరాజ్ పాల్ బూటకపు కంపెనీలు ఎలా అయితే ఉన్నాయో ఆ విధంగా ఉండటానికి, హక్కు ఉంది. బూటకం అని ఎందుకంటున్నానంటె అసలు ఈ స్వరాజ్ పాల్ ఎవరో ? 'ఆధునికీకరణ' పేరుతో మన కంపెనీలన్నీ కొనడానికి 2 కోట్ల డాలర్ల డబ్బు ఎలా మూట కట్టుకు వస్తున్నాడో మనకెవరికీ తెలీదు. అతను ఎంతటి అద్భుతమైన కంపెనీలు ఇంగ్లాండులో నడుపుతున్నాడో మనకు తెలీదు !

నా ఉద్దేశ్యంలో అస్సలు ఈ స్వరాజ్ పాల్ ఒక నకిలీ, ఆయన కంపెనీలన్నీ బూటకాలే. అతను భారతదేశానికి రావడంలోని ముఖ్య ఉద్దేశ్యం దేశాన్ని కొల్లగొట్టడమే. ఇలాంటి దోపిడి దారులను గతంలో మనం అనేకమందిని చూసాం. తాము తీసుకున్న గోతుల్లో తామే పడిన వారి సమాధులే చివరికి మిగిలాయి ! 

# ఎడారిలో ఎర్రకలువ

'రాధ' సాయిరమేష్

(గత సంచిక తరువాయి)

మార్గరెట్ పూసగ్రుచ్చినట్లు పురాణం విప్పే సరికి భారతీదేవి బిక్క చచ్చిపోయింది. మనసులో ఆలోచనలు మంచుగడ్డలయ్యాయి. ఆమె నోట మాటరాలేదు. అలా ఎంతసేపు కూర్చుండి పోయిందో ఆవిడకే తెలీదు. మార్గరెట్ భుజం తట్టి 'భయపడకు అంతా సర్దుకుంటుందిలే' అని చెప్పి వెళ్ళిన సంగతే గుర్తులేదు.

మత్తు యిచ్చి పడుకోపెట్టిన మనిషి కొంత సేపటికి మత్తుదిగి మరో లోకంలోంచి దిగుతున్నట్లు భారతీదేవి మనసులోని మూగ వేదనంతా కరుగుతోన్న మంచుగడ్డలా మారింది.

శంకరరావులో వున్నపళంగా వూహించనంత మార్పు రావటం భారతికి భరించరానిదే అయ్యింది. భార్యకి అన్యాయం చేయాలన్న తలంపు ఎలా కలిగిందో ఆ మనిషికి ? మనసుపడి ఏరి కోరి చేసుకున్నాడు భారతిని ఓ పాతికేళ్ళ క్రితం. యింట్లో వాళ్ళు వప్పుకోకపోతే ప్రక్కవూరు తీసుకువెళ్ళి గుళ్ళో పెళ్ళి చేసుకుని వున్న వూళ్ళో పంచాయితీ పెట్టించి మరీ చాటించాడు శంకరరావు, భారతీదేవి తన ముద్దుల భార్యని.

ఒకే కులం కానందుకు యింట్లో వాళ్ళు వెలివేస్తే వెర్రిచూపులు వేసి వెక్కివెక్కి ఏడ్వకుండా గుండె నిబ్బరంతో ఆ కష్టాలన్నీ దాటుకుంటూ ఆఖరికి ఆ దూరతీరాలు చేరుకున్నారు చిలకా గోరింకల్లా.

ఆ ప్రేమాయణమంతా పాతగాథై గతంలో కరిగిపోయినా, మళ్ళీ అందరూ ఒకటయ్యారు అని అందరూ అబ్బురపడి చెవులు కొరుక్కునేటంతగా సంబంధాలు పెరిగినా శంకరరావుగారి ప్రవర్తనలో మాత్రం ఎలాంటి మార్పూ రాలేదు అన్నాళ్ళుగా. ఇప్పుడు అర్ధాంగిమీద వున్న అపురూపమైన ప్రేమ హారతి కర్పూరంలా ఆవిరైపోతుంటే ఆ వుత్తమ యిల్లాలి కొనకంటిలో వుప్పెనలు పొంగటంలో వింతేమి వుంటుంది ?

దేముడికి హారతి యివ్వాలంటే కర్పూరాన్ని కరిగించి తీరాలి అని సర్దిపుచ్చి చెప్పటానికి మార్గరెట్ లాంటి మరో యిల్లాలు తప్పించి యింకెవ రున్నారు ఆ ఆంధ్రుల ఆడపడుచు భారతీదేవికి ఆ పరాయి భూమిలో !

సాయంత్రం నాల్గు దాటుతోంది. బ్రిటిష్ వాతావరణం అప్పటికే అర్ధరాత్రిని గుర్తు చేస్తోంది. బయట ఫాగు లైట్లు మంచుతెరల్ని చీల్చలేక అవస్థ పడుతోన్నాయి మసక వెలుగుతో.

నీరసంగాలేచి వెళ్ళి లైటు వేసింది భారతీదేవి. తీర్చి దిద్దినట్లు అమర్చుకున్న లాండ్‌బార్‌లో కూర్చుని బెల్స్ విస్కీబాటిల్ విప్పింది. అంతవరకూ ఎప్పుడూ ఏ మత్తుపానీయాన్నీ అంత పెద్ద ఎత్తున ఆస్వాదించలేదేమో ఆ ఆడబిడ్డ కాస్త వుక్కిరిబిక్కిరి అయ్యింది. 'తంచుకుంటున్నాడు కాబోలు ఆకతాయి వాడు ఎక్కడో కుఐకుతూ' మత్తులో నెత్తికొట్టు కుంది భారతి, కసితీరా కట్టుకున్నవాడ్ని తిట్టు కుంటూ.

అంతా గతమే అన్నట్లు ఆ రాత్రి కూడా గతంలో కలిసిపోయింది,మెల్లగా చల్లగా ఆ ఆంధ్రుల



ఆడపడుచుని శుభ్రంగా చిత్తు చేస్తూ.

భారతిదేవి ఆ నిర్ణయానికి రావటంలో తప్ప లేదేమో కాని అది ఎంతవరకూ సమంజమయ్యింది అని చెప్పటానికి సరిఅయిన తోడు లేకపోవటమే శోచనీయమైన విషయం అయ్యింది.

ఆ బాధ్యత కూడా నెత్తిన పెట్టుకోడానికి మార్గరెట్ తోబుట్టువా తోటి కోడలా ?

అందుకే "నీ యిష్టం భారతి, నీకు ఎలా తోస్తే అలా చేయి" అంది తప్పించుకుంటూ.

"నీ వుద్దేశం ఏమిటో సిన్సియర్‌గా చెప్ప మార్గరెట్ ప్లీజ్ ..." అంది ఆఖరిసారిగా బతిమ లాడుతూ.

"నాకేమీ కొత్తగా అనిపించటం లేదు మరి... ఏదో టి. వి. లో డాలాస్ సీరీస్ లాంటిది చూస్తు న్నట్లుందంతే" అని నవ్వింది కొట్టిపారేస్తూ.

"అయితే నా జీవితం కూడా నీకో టి. వి. సీరీస్‌లా వుందన్నమాట ... మైగాడ్."

"అబ్బే... అదికాదు భారతీ... ఏదో సర్దాకి అన్నానంతే... మరీ అంత సీరియస్‌గా తీసుకోక మరి..."

"ఫర్ గెట్ యిట్..." భారతి చిన్నబుచ్చు కుంది.

"ప్లీజ్... టెల్ మి వాట్ కెన్ అయ్ డు







ఫర్ యు...'' మార్గరెట్ బతిమాలింది మన్నించ మన్నట్లు చూస్తూ.

అయిదారు క్షణాలు అతి దీక్షగా ఆలోచిస్తూ ఆఖరికి అడిగింది భారతి—

''ముందు ఆ సుందరిని ఓ మారు చూడాలని వుంది...''

''అంతేకదా... అదెంతపని... అయ్ విల్ అరేంజ్...నిజానికి నర్స్ వాకర్ నాకు చానాళ్ళబట్టి తెలుసు... నేను సిస్టర్‌గా పనిచేస్తున్న రోజుల్లో వెండీవాకర్ నా దగ్గర స్టూడెంట్... అయ్ కెన్ కాల్ హెర్ ఫర్ టీ...'' అంది మార్గరెట్ మురిసిపోతూ.

భారతీదేవి పరాకుగా ఊకొట్టింది రేస్‌కారులా అంతరాలోచనలు దూసుకుపోతోంటే.

* * *

ఆఖరికి ఆ రోజు రానేవచ్చింది. అతి ఖరీదైన తన బి. ఎమ్. డబ్ల్యు కారులో బయలుదేరి వెళ్ళింది భారతి.

జీవితం ఆరని దీపం కాదు. మనిషి మాసిపోని కొత్తబట్ట కాదు. దీపం ఎప్పుడో ఒకప్పుడు ఆరిపోతుందని గాలిలో పెడ్తే ఏం బాగుంటుంది? బట్టలు మాసిపోతాయని బీరువాలో దాచి తాళం వేస్తే ఏం మిగులుతుంది? దేనికది ఎప్పటికప్పుడు వాడుకోవాలి, ఆడి ఆరేసుకోవాలి. పాడైపోతుం దన్నప్పుడు తగు జాగ్రత్త తీసుకోవాలి. చిన్నతనంలో తాతగారు పిట్టకథలు చెప్తూ భారతికి బోధించిన పరమార్థం అదొక్కటే. శాశ్వతంగా ఆవిడ మనసులో శిలమీద చెక్కిన సూక్తుల్లా నిలిచి పోయాయి, ఎప్పటికప్పుడు ఆమెకి మనోబలాన్ని ప్రసాదిస్తూ!

వూహలతో వుక్కిరిబిక్కిరి అవుతూ వూపిరి బిగబట్టి మార్గరెట్ యింట్లో అడుగు పెట్టింది. అప్పటికే విలాసిని వెండీవాకర్ అక్కడ ప్రత్యక్షమై వుంది విరిసిన కలువలా వయ్యారం వలకబోస్తూ.

పరిచయ కావ్యాలు పూర్తికాగానే వెండీవాకర్ కరచాలనంచేస్తూ —

''మీ గురించి విన్నానుకాని మిమ్మల్ని యింత వరకూ ఎప్పుడూ చూడలేదు మరి'' అంది తన కన్నె వన్నెలకి కళ్ళెంవేసి లాగుతూ.

''ఐసీ...'' మాటలే కరువయ్యాయి భారతీ దేవికి.

## ఎడారిలో ఎర్ర కలువ

''డాక్టర్ రావు నాకు బాగా తెలుసు... ఆయన వార్డులోనే నేను స్టాఫ్‌గా పనిచేస్తోంది మరి'' నాజూకుగా నవ్వింది వెండీ.

మార్గరెట్ కాఫీ నెపంతో కిచన్‌లోకి వెళ్ళింది. భారతి అవకాశాన్ని వదులుకోలేకపోయింది.

''పెళ్ళయ్యిందా మీకు...'' అడిగింది భారతి.

''పెళ్ళా...'' ఫక్కున నవ్వి— ''అయ్ హేట్ దట్ వర్డ్—'' అంది విలాసిని వెండీ.

''ఎప్పుడో ఒకప్పుడు చేసుకున్నట్టు నటించాలిగా ఆడదై పుట్టాక...''

''మా ఆంగ్లేయులికి అలాంటి రూలేమీలేదని మీకు తెలిసేవుండాలే...'' అందివెండీ వెటకారంగా.

''నా వుద్దేశం అదికాదు...''

''అర్థమయ్యింది మీ అనుమానం ఏమిటో... బట్ యుసీ... అయ్ డోంట్ మైండ్... పెళ్ళి కాకుండా పిల్లలు పుట్టినా నేనేమీ వర్రీ అవ్వను... యిన్‌ఫేక్ట్ అయ్ హేట్ చిల్డ్రన్ టూ...'' అంది చూపులతో చీదరించుకుంటూ.

''అలాగా...'' భారతి ఎత్తిపొడిచింది అతివ మీద కోపమంతా ఆత్మలోనే దిగమింగుకుని మృదు మధురమైన చిరునవ్వు ఒకటి మోముమీద తెచ్చి పెట్టుకుంటూ.

''నిజానికి నాకు అదే హేపీగా వుంటుందంటే నమ్మండి... ఓ గొడవ వుండదుకదా మొగుడితోనూ, మొసాటెత్తించే ఈ సంసారంతోనూ...'' గుచ్చి గుచ్చి చూసింది వెండీ ఆ మాటలంటూ.

''మీకు తెలీదేమో కాని మా ఇండియన్ ఆడవాళ్ళు చాలా అమాయకులు మరి... అలాంటి విషయాల్లో...'' భారతీదేవి ఎదురుదెబ్బ తీసింది.

''అయ్ పిటీ దట్...''

''విచ్చలవిడిగా తిరిగి చిన్నప్పటిమంచీ అన్నీ నేర్చుకుని వుంటే ఏమోమరి... దేనికైనా తెగించ వచ్చేమో మీ ఆడవాళ్ళలా...''

''అదేమంత కష్టమైన పని కాదే ఒకరిని చూసి నేర్చుకోటానికి... చూడండి మిసెస్, రావ్. ఆడదైనా, మగవాడైనా ఆనందంకోసం ఏంచేసినా తప్పులేదని నా అభిప్రాయం. మీరు నాతో ఏకీభ వించాలని ఏమీ లేదనుకోండి... విషయం వచ్చింది కాబట్టి చెప్తున్నాను... పన్నీరైనా కన్నీరైనా అరచేతిలో ఎంతకాలం దాచుకోగలం చెప్పండి... యు మస్ట్ బి నోయింగ్ ఆల్ దిస్...ఏ మంత్రానికి ఆ మంత్రం వేయాలి మరి ...'' అంది దర్పంగా వెండీ మాటలతో భారతీదేవిని మభ్యపెడుతూ.

''అలాఅని మన ఆనందంకోసం మరో ఆడదాని జీవితాన్ని బండపాలు చేస్తే ఏమి బాగుంటుంది చెప్పండి...''

భారతి మనసు బెంగపడింది ఆ వగలాడి వాక్చాతుర్యానికి తట్టుకోలేక.

సంసార సాగరంలో ఓ పెను తుఫానులో చిక్కుకుని వూగిసలాడుతోన్న చిన్న తెప్పకి తెరచాప వేస్తే మంచిదో చుక్కాని త్రిప్పితే మంచిదో అర్థం కాలేదు, ఏమీ సాధించలేక ఆక్రోశిస్తున్న ఆ అలివేణి ఆత్మకి ఆ క్షణం.

''యిప్పుడు అలాంటి గొడవలేవీ లేవు కదా మన యిద్దరిమధ్యా... అంత పెద్దగా బాధపడి పోవటానికి... ప్లీజ్ మిసెస్ రావ్ టేకియిట్ ఈజీ విల్ యు...?''అంది వెండీవాకర్ వ్యంగ్యంగానవ్వుతూ.

''అఫ్‌కోర్స్... అఫ్‌కోర్స్ ..'' మొగమాట పడింది భారతీదేవి మాటలు కరువై. మార్గరెట్ రాక మరోసారి భంగపరచింది, మనసు కరిగించే ఆ మగువ కథని అసంపూర్తిగా వదిలేస్తూ.

తేనీటి విందులు సేవించటం పూర్తయ్యాక వెండీ లేచింది కదిలివెళ్ళే వుద్దేశంతో...

''హోప్ టు సి యు ఎగేన్ సమ్‌టైమ్ మిసెస్ రావ్...''అని, వయ్యారంగా ఎత్తుమడమలు చప్పుడుచేస్తూ మినీ కారు ఎక్కి శరవేగంతో యవ్వనాన్ని ఎగరేసుకుపోయింది ఆ నెరజాణ, మబ్బుల్లో దాగిన సూర్యుణ్ణి అందుకోవటానికి.

* * *

భారతీదేవి సగం మనిషి అయ్యింది ఆ పది పదిహేనురోజులకే. ఆవిడ మనోవేదనకి మందేమిటో శంకరరావుగారికి బాగా తెలుసు. అయినా తనకు పట్టనట్టు వూరుకున్నారు అన్నాళ్ళూ.

మనసుపడి చేసుకున్న మగువమీద మమత చంపుకోలేకో, ముఖం తుడుచుకోలేకో తెలీదుకాని ఓ శుభోదయంలో సానుభూతి చూపించారు శంకరరావు.

''ఏం భారతీ ఈ మధ్య బాగా నీరసంగా వుంటున్నావు ... వంట్లో బాగుండటం లేదా'' అని అడుగుతూ.

''నేను ఎలావుంటే మీకే ... మీ ఆటపాటలకి అడ్డురావడం లేదుగా'' అంది భారతి, ఆవేశాన్ని లోలోపల అణచివేసుకుంటూ.

# భారత దేశమంతటా డీలర్ల విశ్వాసాన్ని పొందిన చిహ్నం

Neelam® STAINLESS STEEL TABLEWARE





ANJALI® Kitchenware



RAMA STAINLESS STEEL WARE



SWAN ELECTRICAL APPLIANCES



MAJESTIC® Kitchenware



NOVELTIES & FEEDING BOTTLE WARMER



amar GASLITER AND MUSICAL TOY



MAJESTIC® Pressure Cooker



Hawkins® PRESSURE COOKER



Ajanta KWALITY KITCHENWARE



Supercook GAS TANDOOR



flora® KITCHEN AIDS



Bindals THERMAL TEA JAR



NIRLEP NON-STICK COOKWARE



Priya ICE PAIL & HOT CASE



Kitchenmate COOK'N' SERVE WARE



CRYSTAL® ELECTRONIC GAS LIGHTER



vinsan



MAJESTIC® WATER FILTER



ఆంధ్రప్రదేశ్‌లోనే 650 మందికి పైగా డీలర్లు విశేష లాభాలకు దానిని చిహ్నంగా కనుగొన్నారు ఎందుకంటే,
అతి ఎక్కువగా అమ్మకమయేవి • వంట పాత్రలు • స్టెయిన్‌లెస్ స్టీల్ పాత్రలు • ఎలక్ట్రికల్ అండ్ ఎలక్ట్రానిక్
అప్లయన్సెస్ • బహుమతులివ్వడానికి పనికివచ్చే కొత్త కొత్త రకాలు దానికింద పంపిణీ అవుతున్నాయి.
అంటే భారీగా మరియు తేలికగా అమ్మకాలు-కాబట్టి లాభాలు ఎక్కువ
మంచి వ్యాపారం కోసం మీరు నిరీక్షిస్తున్నట్లయితే, డీలర్‌షిప్ కొరకు రాయండి. ఆంధ్రప్రదేశ్
అంతటినుండి డీలర్‌షిప్ కొరకు దరఖాస్తులు కోరబడుచున్నవి.

allied



ఆంధ్ర ప్రదేశ్‌కు డిస్ట్రిబ్యూటర్లు

PH : 221198/34819

**మహావీర్ ఎంటర్‌ప్రైజెస్, తిలక్ రోడ్, హైద్రాబాద్-1**

''నీకేమైనా మతిపోయిందా ... అవేం మాటలు ...'' అన్నారు శంకరరావు మందలింపుగా.

''ప్లీజ్ నన్ను విసిగించకండి ... మీ పనేదో మీరు చూసుకోండి ... వెళ్ళండి'' అంది భారతి పెల్లుబుకుతున్న దుఃఖాన్ని పదునైన మాటల్లో పెడ్తూ.

''ఆల్‌రైట్ ... నాతో మాట్లాడటానికికూడా నీకు అంత చిరాకు అనిపిస్తే ... నీ ఎదురుగా కూర్చుని అడుగులు మడుగులు వత్తాల్సిన పని నాకేమీ లేదు . మర్చిపోకు. సంజాయిషీ చెప్పుకోవలసినంత పొరపాటు పని ఏమీ చేయలేదు నేను. నువ్వే లేనిపోని అపోహలతో అనుమానాలు పెంచుకుని అద్దంలాంటి జీవితాన్ని ముక్కలు చేసుకుంటున్నావు. దానివలన నీకూ, నాకూ ఎవరికీ ఏమీ వరగదు లేనిపోని ఆవేదన తప్పించి ... నేను ఎప్పుడూ ఒకేలా వున్నాను ... వుంటాను కూడా'' వుద్రేకంతో ఉపన్యాసం పూర్తిచేసి సగం సగం తిన్న సేండ్‌విచ్ ప్లేట్‌లో వదిలేసి వున్నపళంగా లేచి వెళ్ళిపోయారు శంకరరావు.

'ఎప్పుడూ ఒకేలా వున్నాడుట ... ఎవరిని వుద్ధరించటానికో ... ఎవరికి తేలీదని ఆ దొంగ తిరుగుళ్ళు ... ఆ మాయ మాటలూను.'

ఉక్రోషం వెళ్ళగ్రక్కింది భారతీదేవి ఆఖరికి వెక్కి వెక్కి ఏడుస్తూ.

* * *

మిసెస్ థాచర్ ప్రధానమంత్రి అయ్యింది. కంజర్వేటివ్ పార్టీ పదవిలోకి వచ్చింది అంటే అర్థం పెట్టుబడిదారులదే ప్రజారాజ్యమంతా అని వివరిస్తోంది టి. వి. లో రిపోర్టర్ అన్నాఫోర్డ్ పదిగంటల న్యూస్ చెప్తూ.

రెండు గ్లాసుల్లో నెపోలియన్ బ్రాందీ పోసి—

''శావ్... నీకు జింజరేల్ కావాలా... కోకో కలుపుకుంటావా'' అని అడిగింది వెండీ.

''ఎనీథింగ్ విల్ డు మై లవ్'' అన్నారు శంకరరావు టి. వి. వార్తల్లో లీనమైపోతూ.

''నీ ముద్దుల యిల్లాలు నన్ను పిలిపించింది. ఎందుకో నీకేమైనా తెలుసా.''

గ్లాసు అందించి ఆయన ప్రక్క ఆసీనురాలయ్యింది అందాల వెండీ.

వున్నట్లుండి వినిపించిన వెండీ మాటలకి నెత్తిమీద పిడుగు పడ్డట్టు వులిక్కిపడ్డారు శంకరరావు.

''ఏమన్నావ్'' అరిచినంతపని చేశారు శంకరరావు నెచ్చెలి చేయి పట్టుకుని పిచ్చిగా కుదుపుతూనే.

''నెమ్మది నెమ్మది, ఏమిటా కంగారు... ఆవేశం ఆరోగ్యానికి అంత మంచిదికాదు... బిహేవ్ యువర్ సెల్ఫ్ విత్ యు...'' ఆయన పట్టు విడిపించుకుని కాస్త ప్రక్కకు జరిగింది వెండీ మూతి ముడుచుకుంటూ.

''అది సరేకాని... నీ గురించి భారతికి ఎలా తెలిసింది.''

ముద్దులదొరసాని చెక్కిలి పట్టుకుని తనవైపు త్రిప్పుకున్నారు శంకరరావు తగ్గు స్వరంతో చిరు లాలిత్యం ఒలికిస్తూ.

''ఏమిటి మన సంగతి యింకా ఈ నాలుగు



గోడల మధ్యే కూర్చుందనుకున్నావా... కమాన్ రావ్... డోంట్ బి ఎ ఫూల్... మన ప్రేమకథ వీధినపడటమే కాదు ... కాళ్ళువచ్చి మీ యింటిదాకా నడిచివెళ్ళింది... వెళ్ళి వూరుకున్నా బాగుండును... తిన్నగా వెళ్ళి మీ ఆవిడని హడలగొట్టేస్తూ తలుపు కూడా తట్టింది మరి...''

అదేదో చెప్పి నవ్వుకోవలసిన ఛలోక్తి అన్నట్టు విరగబడి నవ్వింది వెండీ వెటకారంగా.

వళ్ళు మండింది శంకరరావుగారికి. అయినా చల్లార్చుకున్నారు చెలిమనసు మరోసారినొప్పించలేక.

''ఈ శృగార పురుషుడి స్నేహాలు...ఈ రహస్య సమావేశాలు అన్నీ ఆవిడకు తెలుసునన్నది నా నమ్మకం...''

ముందుకు వంగి శంకరరావుగారిని మెల్లగా ముద్దాడింది ఎక్కడలేని ప్రేమ ఎదలోంచి పొంగిస్తూ.

కొన్ని క్షణాలు మౌనం వహించాడు ఆయన వగలాడి వంపు సొంపులు తగిలి తనను తాను మైమరచిపోతూ.

''ఏమడిగింది మా ఆవిడ'' గంభీరంగా అడిగారు శంకరరావు కామిని కౌగిలిలోంచి తాత్కాలికంగా తప్పుకుంటూ.

''ప్రత్యేకించి ఏమీ అడగలేదు కాని ఓసారి కదిపి చూసింది గుట్టు బయట పెడ్తానేమోనని...''

''నువ్వేం చెప్పావు ...''

''ఆహా ... నాతోనా నాటకాలు ... ఆరు నూరైనా నోరు జారను ... నీకు తెలీదేమో కాని... నాతో నిజం చెప్పించటం ఆ జీససు తరం కూడా కాదు ... అందులో యిలాంటి విషయాల్లో ...'' దర్పంగా ఓ చిరు దరహాసం చిందించి — ''నువ్వేమీ వర్రీ అవ్వకు రావ్...తగు జాగ్రత్త తీసుకున్నానులే'' అంది భుజం తట్టి హామీ యిస్తూ.

''అసలు భారతికి ఎలా తెలిసిందబ్బా మన సంగతి ...'' అన్నారు శంకరరావు వెండీ వాలకాన్ని శంకిస్తూ.

''ఇలాంటి విషయాల్లో ఆరితేరిన నిపుణులు... నారీమణులు చాలామంది వున్నారులే ... నువ్వు బాధపడి ప్రయోజనం లేదు ... వాళ్ళ. వృత్తే అది మరి ...'' అంది బుజ్జగిస్తూ.

''ఎవరో ఆ పుణ్యాత్ములు...'' వెటకరించారు శంకరరావు మాటలు సాగదీస్తూ.

''ఇంకెవరు మిసెస్ లాయిడ్ ...''

''యు మీన్ మార్గరెట్ లాయిడ్ ...''

''ఆహా ...''

''ఓ మై గాడ్'' తల పట్టుకున్నారు శంకరరావు.

''డోంట్ వర్రీ రావ్ ... నీ పరువు ప్రతిష్ఠలకి ఎలాంటి భంగం రాదని నేను హామీ యిస్తున్నాను సరేనా ... యిలాంటి విషయాలు పట్టించుకోనట్టు వూరుకుంటే నాటికవే సద్దుమణిగి పోతాయి ... కమాన్ లెట్ అజ్ హేవ్ ది డ్రింక్ ... చీర్స్ ఫర్ యువర్ హెల్త్ అండ్ హేపీనెస్'' అంటూ గ్లాసుడు బ్రాందీ గడగడా త్రాగేసింది వెండీవాకర్.

* * *

మార్గరెట్‌ని యింటికి ఆహ్వానించింది భారతి ఫోన్‌చేసి.

''ఏమిటి వున్నట్లుండీ పండగ ...'' అసహనంగా అడిగింది మార్గరెట్ వచ్చీరాగానే.

''అబ్బే పండగేమీ లేదు ... నేను చెప్పిన పని ఏం చేశావో తెలుసుకుందామని ... అయినా ఇలాంటి విషయాలు ఫోన్‌లో మాట్లాడితే బాగుండదు కదా... అందుకని'' అంది భారతి బెదురు చూపులు చూస్తూ.

''అంతేకదా... ఏదో కొంప మునిగిపోయినట్లు నువ్వు యిందాక ఫోన్‌లో మాట్లాడ్తుంటే చాలా కంగారుపడ్డాను మరి... న్యూజిలాండ్ నుంచి మా కజిన్ వచ్చిందేమో;యింట్లో కాస్త హడావిడిగా వుంది...'' అంది మార్గరెట్ అసహనంగా.

''అయామ్ సారీ మార్గరెట్... అనవసరంగా నీకు యిబ్బంది కలిగించినట్లున్నాను...''

''నోనో... యిటీజ్... ఓ. కె.''

''డ్రింక్ ఏమైనా పుచ్చుకుంటావా'' భారతి ఎర చూపించింది దొరసానికి సముదాయింపుగా.

''నో... థేంక్యూ... అయ్ మస్ట్ రియల్లీ గో నౌ...''

''హేవ్ సమ్ జిన్ అండ్ టానిక్.''

ఓ క్షణం తటపటాయించి ''ఆల్ రైట్'' అంది ఆఖరికి.

విలువైన మందు అందగానే మారు మాట్లాడకుండా కూర్చుంది మార్గరెట్ అరగంటపైగా.

''వెండీతో మాట్లాడావా'' అడిగింది భారతి

''ఆహా...''

''ఏమంది...''

''నిజం చెప్పమంటావా'' జాలిగా చూసింది మార్గరెట్.

''ప్లీజ్...'' భారతి కంఠం దుఃఖంతో బొంగురుపోయింది.

''మొగుడంటే మోజు వున్న ఏ ఆడదీ వాడ్ని గాలికి వదిలేసి వూరుకోదట... ముందే తను జాగ్రత్త తీసుకోవాలట... అంతేకాదట... రావు నీకెంతో యిప్పుడు తనకీ అంతేనట... అయితే రావుకి ఎవరు కావాలో మీ యిద్దరిలో అన్నది అతడు తేల్చుకోవలసిన విషయమేనట... అందులో తను చేయగలిగింది ఏమీలేదట... తను ఎవరినీ కట్టిపడేయిలేదట ... ఎవరి దారికీ అడ్డురాదట... అలా అని చెప్పమంది నీతో...'' గాఢంగా నిట్టూర్చి ఓ గ్రుక్కెడు జిన్ ఆస్వాదిస్తూ మళ్ళీ మొదలుపెట్టింది మార్గరెట్-

''ఎనీవే... యిదీ మా సంభాషణ సారాంశమంతా... సారీ భారతీ... యిది చాలా హార్ట్ బ్రేకింగ్‌గా వుందికదూ నీకు... ఏంచేస్తాం చెప్పు రావు నీకు యింత అన్యాయం చేస్తాడని నేను ఎప్పుడూ అనుకోలేదు... మీ ఇండియన్ మగవాళ్ళు ఎంతో ఉత్తములనీ, ఉన్నతాదర్శాలు కలవాళ్ళనీ నేనూ అపోహపడ్డాను సుమా...'' అంది తీసిపారేస్తూ.

ఆపైన మార్గరెట్ ఏదేదో చెప్పిందికాని ఏమీ పట్టించుకునే స్థితిలో మాత్రం లేదు భారతి. యింకెందుకు కథకి అంతం యిదే అని తెలిసినప్పుడు యింకెవరో వచ్చి ఆదుకుని ఆ కథని పొడిగిస్తారని అపోహపడటం శుద్ధ అవివేకం అనిపించింది బెంగ పడ్డ భారతి మనసుకి.




# గ్లూకోన్-డి ® తీసుకోండి

ఇది మీరు
నమ్మిన
గ్లాకోస్ జ్-డి
యొక్క
కొత్త పేరు

**అదనపు శక్తి కోసం—అలా మీకు కావలసినప్పుడల్లా.**

అలసట కలిగించడంలో వేడిని మించిందిలేదు. అలా వేడి వాతావరణంలో పనిచేస్తున్నప్పుడు అలసట, దాంతో పాటే నీరసం వచ్చేస్తుంది. అప్పుడే మీకు కావాలి ఉత్సాహాన్నిచ్చే, చల్లదనాన్నిచ్చే గ్లూకోన్-డి. అది మీకు అదనపు శక్తిని ఇస్తుంది. అలా మీకు కావలసినప్పుడు.

గ్లూకోన్-డి, లక్షలాది మంది 30 ఏళ్ళుగా విశ్వసిస్తూ వస్తున్న గ్లాకోస్ జ్-డికి కొత్త పేరు. పళ్ళరసం, పాలు, టీ, కాఫీ, నీళ్ళు—దేనిలోనైన అలా దాన్ని కలుపుకు తాగండి లేక దేనితో కలపకుండా అలాగే తాగండి. శక్తి అలా ఉరకలు వేస్తూవచ్చే అనుభూతిని పొందండి.

గ్లూకోన్-డి మీ కుటుంబంలో నివారందరి కోసం. పనుల్లోనూ, ఆటల్లోను వారికి చురుకుదనం కోసం. గ్లూకోన్-డి—అందరికీ పరిచయమున్న అదే పచ్చ ప్యాక్‌లో వస్తుంది.






**విటమిన్ డి, కాల్షియం ఫాస్ఫేట్‌తో బలపరచబడిన**
**అసలైన గ్లూకోజ్ పౌడర్—గ్లాక్సో సమర్పణ**

HTB-GLL-6591-TG

### పి. యు. ఎమ్. — కాశీబుగ్గ

రామలక్ష్మిగారూ, మీ పై మీ అభిప్రాయం ఏమిటి ? ఇలా అడిగానని కోపం తెచ్చుకోకండి.

★ నేనేం శ్రీశ్రీనా— నా కంటే ఘనులిక లేరు —వుండరు అనుకోడానికి ! నేను చాలా మామూలు మనిషిని. నేల విడిచి సాము చేయడానికి కూడా భయం.

### పీలిమ - కొడవలూరు

రైను లాగిన రైలు ఆగును. మరి అమ్మాయి పైటచెంగు లాగితే ?

★ పళ్ళు రాలును ! ( సారీ — దంతములు రాలును ! ! )

### భవాని — కాశీబుగ్గ

దేవుడిని వాడు వీడు అనే వాడుతారు. అలా అంటే పాపం కాదా ?

★ ఆత్మీయత ధ్వనిస్తుంది — ఏ క వ చ న ప్రయోగంలో.

### బి. ఎన్. పి. — కాకినాడ

మీరు సమాధానాలు చెప్పడానికెవరినేనా సలహో అడుగుతారా ?

★ అడగను. వంట ఒకే చేతి మీద సాగాలని నమ్మేదాన్ని !!




### ఎల్. ఎన్. — భువనేశ్వర్

మన దేశంలో నిరుద్యోగ సమస్య ఎప్పటికి తీరుతుంది ?

★ ఉద్యోగం అంటే 'ఆఫీసులోనే' అనుకునే తత్వం కుర్రాళ్ళలో తగ్గాలి. ఆత్మ గౌరవానికి భంగంకాని ఏపనేనా చేయడానికి— ముందుకు రావాలి. అప్పుడే కాస్తేనా — యీ నిరుద్యోగపు కొండచిలువ కదలడం ప్రారంభిస్తుంది.

### జె. ఎస్. కె. — ప్రొద్దుటూరు

"పొ ద్దు తి రు గు డు పూలు" సినిమా కని ప్రత్యేకంగా రాశారా ?

★ అవును.

### టి.టి.ఎమ్. — పెదకాకాని

నిష్కల్మషమైన స్నేహాలకు, ఆత్మీయతా బంధాలకు — అక్రమ సంబంధం అంటగట్టి అపోహ లను సృష్టించే కొందరు చదువుకున్న 'కుసంస్కారులను' ఏమనాలి ?

★ మీ మనస్సు పరిశుద్ధంగా వున్నప్పుడు — కుసంస్కారుల మాటలనెందుకు పట్టించుకోవాలి ? వారిని నమ్మించాలన్న తాపత్రయం ఎందుకు ?

### ఎస్. వి. ఆర్. — చినవంత

ఆడది చాలా పొగరుబోతు అని నేనంటాను ?

★ చిత్తం తెలివైన ఆడదానికి కాస్త పొగరు —అందమే.

### ఎస్. వి. వి. - వనవర్తి

రాచరికాలు లేని మన ప్రజాస్వామ్యంలో ఆస్థాన విద్వాంసుల పరువేమిటి ?

★ అజాగళ స్తనాలు ! ఉన్నా లేకున్నా ఒకటే

### టి.వి.ఆర్. - పెనమలూరు

నాకు చిన్నపిల్లలంటే యిష్టం. స్వార్థం అంటే తెలియని వాళ్ళ మంచి మనసు మంచి హృదయం వుంటాయి.

★ నిజమే. కాని వాళ్ళలా చిన్నపిల్లలుగా వుండిపోరే ! ★

---

అది జరిగిన వారం రోజులకే అనుకోని దారుణం జరిగిపోయింది.

ఆంధ్రుల ఆడపడుచు, శంకరరావుగారి ముద్దుల యిల్లాలు, యిరవై సంవత్సరాలు పైగా అతని ఏకైక అర్ధాంగిగా ఏకచ్ఛత్రాధిపత్యం చేసిన భారతీదేవి ఆయువు ఆఖరికి అనంత వాయువుల్లో ఐక్యమైపోయింది.

దిగులు అనే జబ్బును తగ్గించటానికి తనభర్త ఎందరికో యిస్తుండే బోర్విడాన్ అనే మాత్రలు ఓ వంద మింగి తన దిగుల్ని శాశ్వతంగా దిగమింగుకుంది భారతి ఆత్మహత్యకి తన పేరుని అంకితం చేసుకుంటూ.

ఆ షాక్‌లోంచి కోలుకోటానికి కొంతకాలం పట్టినా చిగురించే ఆశలు శంకరరావుగారిని చాలా త్వరగానే ఏటిగట్టుకి చేర్చాయి. తేలటానికి మానో మాన్ చేతికి దొరకాలేకాని ఎంత సాగరమైనా ఈది తేలటం ఎంతసేపు బ్రతుకుమీద ఆశవుంటే ?

భారతీయ సాంప్రదాయాలతో, ఆచారాలతో, కుల మత తత్వాలతో విసిగి వేసారిపోయిన శంకరరావు గారికి తెల్లవాళ్ళ అందాలు ఆర్భాటాలు కనువిందు కలిగించాయి. మత్తుజల్లి మనసుని ఆకట్టుకోటమే కాదు, మనిషిలోకూడా శాశ్వతంగా జట్టు కుదుర్చుకున్నాయి కోమలాంగి వెండీ వాకర్‌తో శంకరరావు గారికి పెళ్ళి కుదుర్చుతూ.

పెళ్ళి ఘనంగా జరిగే అవకాశం ఎలాగూలేదు. కాబట్టి కనీసం హానీమూన్ అయినా కోర్కెతీరా పెద్దఎత్తున జరుపుకోవాలని నిర్ణయించుకున్నారు ఆ నెనేసీ నెరవని కొత్త జంట.

"వెనిస్ వెళ్దాం... మైలవ్" అని అడిగింది ముద్దుగా.

## ఎడారిలో ఎర్ర కలువ

"బైన్ లేదు స్వీట్ హార్ట్... బ్లాకుపూల్‌తో తృప్తిపడదాం ప్రస్తుతానికి" అనునయించారు శంకరరావు.

"కనీసం అమెస్టర్‌డామ్ అయినా వెళ్తే బాగుంటుందేమో" అలిగింది అందంగా వెండీ.

"స్కాట్‌లాండ్ వెళ్దాం నీకంత మోజుగా వుంటే" ముంగురులు నిమిరారు ఆయన.

"ప్లీజ్... సార్డినియా వెళ్దాం... నీ ముద్దుల యిల్లాలి ఈ చిన్న కోరిక తీర్చలేవా చెప్పు." అంది వెండీ గోముగా చూస్తూ ముందుకువంగి ముద్దు పెడ్తూ.

"ఆల్‌రైట్ డార్లింగ్... నువ్వు మనసుపడి అడిగితే నేను కాదనగలనా చెప్పు." మండుటెండలో మంచుగడ్డలా కరిగిపోయారు శంకరరావు.

మర్నాడు బయలుదేరి హానీమూన్ జరుపుకోటానికి స్పెయిన్ వెళ్తారనగా — ముందురోజు రాత్రి తన ఎలక్ట్రిక్ మంచంమీద నడుం వాల్చారు శంకరరావు వళ్ళుమరిచి గురకలుపెట్టి హాయిగానిదురపోతూ.

వుల్లిపొర కాగితంలాంటి పొడుగాటి నైటీలో తన అందానికి విందులు చేస్తూ కొత్త భర్త చేతులు విడిపించుకుని మంచందిగింది వెండీ, చులకనగా శంకరరావు వైపు చూసి చిరునవ్వు చిందిస్తూ.

వులిక్కిపడి లేచారు శంకరరావు వున్నట్లుండి. చేత్తో తడిమి చూస్తే బెడ్‌మీద వెండీ సుతిమెత్తని శరీరం తగలలేదు. ఫోన్ డయల్ చేస్తున్న శబ్దం ఆయన్ని నిద్రాదేవి వడిలోంచి పూర్తిగా లేవదీసింది.

బెడ్‌లైట్ వెలిగించి టైమ్ చూసుకున్నారు. రాత్రి పన్నెండు దాటుతోంది.

"ఇంత రాత్రి ఎవరికబ్బా ఫోన్ చేస్తోంది.."

అనుకుంటూ మంచం దిగి గుమ్మంవైపు నడిచారు

తలుపు తీయబోతూ చటుక్కున ఆగిపోయారు మస్తిష్కంలో వున్నట్లుండి మెరిసిన ఓ మాయదారి తలపుతో.

వెనక్కు తిరిగి మంచం దగ్గిరవున్న ఎక్స్‌టెన్షన్ ఫోన్ నెమ్మదిగా ఎత్తారు మౌత్‌పీస్ చేత్తో మూసిపట్టుకుంటూ.

"యు డోంట్ వర్రీ డార్లింగ్... అంతా నేను చూసుకుంటానుగా ... యింకెన్ని రోజులు .. ఆ మాత్రం ఓపిక పట్టలేవా చెప్పు ... కమాన్ . డోంట్‌బి సిల్లీ ... ముసలాడితో నాకు హానీమూన్ ఏమిటి చెప్పు ... అతగాడికి నేను కావాలి ... నాకు నువ్వు కావాలి... మన యిద్దరికీ డబ్బు కావాలి ... ఏమంటావ్... గుడ్... దటీజ్ బెటర్... ఆల్‌రైట్ మై లవ్... మళ్ళీ నేను ఫోన్ చేస్తాను స్పెయిన్ నుంచి తిరిగి రాగానే ... ఎప్పటిలా అక్కడే కలుసుకుందాం... ఓ.కె... మై స్వీట్ కిసెస్ డార్లింగ్.."

శంకరరావుగారికి కాళ్ళ క్రింద భవంతి కంపించి ఎక్కడో భూమిలోకి కృంగిపోతున్నట్లు అనిపించింది.

భారతీదేవి మృదు మధురమైన సుందర రూపం, చిన్ననాటి సౌకుమార్యం ఒక్కసారిగా ఆయన కళ్ళ ముందు కదిలాడాయి.

మరుక్షణంలో కళ్ళముందు కారుచీకట్లు క్రమ్ముకున్నాయి.

"ఏమయింది డార్లింగ్...మర్వెందుకు లేచావు" అంటూ భర్త భుజం చుట్టూ చేతులు వేసి వయ్యారం వలకబోసిన వెండీ చేతులకి చైతన్యం తప్పిన శంకరరావు శరీరమే దక్కింది; ఆ దొరసాని ఏనాడో ఏ దే ము డి కో నో చు కు న్న నోము ఫలితంగా ? ? ?

-[అ యి పో యిం ది ] ●

# వారఫలం

27-5-1983 శుక్రవారం మొదలు 2-6-1983 గురువారం వరకు

♈ మేషం: పెద్దల అభిమానం సంపాదించుకోగలరు. చాలమందికి వ్యాపారంలో లాభదాయకం. నూతన విధానంలో చాలమందికి లాభించే మార్గ మున్నది. నూతన వ్యవహారాలలో మీకు విజయ మున్నది. స్త్రీలకు: అభిమానుల వలన మేలు చేకూరగల వారమే.

♉ వృషభం: చాల కాలంగా మీతో విరోధించిన వారు సమీపానికి రానున్నారు. మీ యాదాయాభివృద్ధికి తోడ్పడనున్నారు. శత్రు వర్గీయుల మూలాన ఏదో యిబ్బంది జరుగబోవు సమయం. స్త్రీలకు: శుభ కార్యానుకూలానికి అవకాశం గలవారం.

♊ మిథునం: సాధారణంగా మీ స్వభావం చాల శాంత యుతమే. అయినా ఒకానొక పరిస్థితి యందు మీరు ఉద్రేకపూరితులు కాగలరు. ఆరోగ్య విషయంలో చాల మంది జాగ్రత్త పడాలి. స్త్రీలకు: క్రయ విక్రయాలలో లాభించే మార్గమున్నది. ఉద్యోగ ప్రాప్తి కూడా కొందర విషయంలో నిశ్చయం

♋ కర్కాటకం: అధికార వర్గం మూలాన మీకు మేలు చేకూరుతుంది. పదిమందిలో పేరు ప్రతిష్ఠలు సంపాదించుకొంటారు. ఒకానొక గృహ విషయంలో తర్జనభర్జనలుండగలవు. వ్యాపారంలో పెద్ద గా లోపం చెప్పదగిన సమయం. స్త్రీలకు: ఉద్యోగంలో మార్పులు రాగల సమయం. కొందరకు 'ప్రమోషన్' లభించే వారం.

♌ సింహం: ఆరోగ్య లోపం ఏర్పడుతుందేమో చూచుకోండి. వయసు మీరిన వారు మరీ జాగ్రత్త వహించాలి. పదిమందిలో పేరు తెచ్చికొనే సన్నివేశం గాని, సంఘంలో పేరు లభించే మార్గం గాని కనిపించగలవారం. చాల కాలంగా విరోధించిన మిత్రులు యింటికి చేరగలరు, ఆదరించాలి. స్త్రీలకు: అనవసర కలహాలకు దారి తీయగల వారం. కలహాలకు తావుండవచ్చు.

♍ కన్య: దూర బంధువులతో పేచీలురాగలవు. నూతన విధాన ధనాగమ మున్నది. అవసరాలకు ధనం చిక్కే అవకాశ మున్నది. మీ తాలూకు వస్తువులు పోగొట్టు కొంటారేమో జాగ్రత్త! స్త్రీలకు: నూతన ప్రయత్నాలు ఫలిస్తాయి. కొందరకు నూతన మిత్ర సమాగమం తథ్యం.

♎ తుల: అధికారులతో సంప్రదింపులు చేయగలుగుతారు. చాలమందికి ఉద్యోగంలో 'ప్రమోషన్' పొందగలుగుమన్నారు. గ్రహించండి. కొందరకు దూర ప్రయాణాలు ఉండగలవు. స్త్రీలకు: నూతన విషయ సేకరణ, ఆదాయం గల వారం. మీకు గల ఋణం కొంతలో కొంత తీరే అవకాశ మున్నది.

♏ వృశ్చికం: సుఖ శాంతులకు, వ్యాపారానుకూలతకు, క్రయ విక్రయానుకూల్యతకు అవకాశం గల వారం. మీతో సహకరించి, సహాయం చేయగల వారున్నారు. వారిని ఉపయోగించుకోండి. యథా తథంగా ధన రాబడి లేకపోలేదు, స్త్రీలకు: యత్న కార్య సిద్ధి, విద్యానుకూలత, 'ప్రమోషన్' లభించటానికి అవకాశ మున్నది.

♐ ధనుస్సు: లాభించే మార్గ మున్నది. పదిమందిలో పేరు ప్రతిష్ఠలకు అవకాశ మున్నది. సంఘ సేవాపరాయణత్వముతో మీకు పేరు లభించే మార్గ మున్నది. సమానులైన వారి సహకారం లభించి యిబ్బందులు తొలగుతాయి. స్త్రీలకు: ధన ధాన్య వస్తు వాహన సేకరణకు అవకాశం, ఉద్యోగానందం సమకూరుతుంది.

♑ మకరం: మీ యాలోచనలు ఫలిస్తాయి. మీ మాటకు అధిక గౌరవం సమకూడుతుంది. కొందరకు అప్రయత్న ధనాదాయ ముంటుంది. అధికార వర్గం మీకు తోడుగా ఉండటం కూడా గమనించగలరు. స్త్రీలకు: అధికాదరణ, పోయిన వస్తువుల భోగట్టా తెలిసికొనుటకు అవకాశ మున్నది.

♒ కుంభం: మీ ప్రయత్నాలు ఫలవంతం కాగలవు, మీ ఆరోగ్యం క్రమాభివృద్ధి నందగలదు. అధికారుల ఆదరణ లభించటం, తద్వారా ఆర్థిక లాభం చేకూరటం గమనించగలరు. స్త్రీలకు: ధన లబ్ధి, మిత్ర సహాయం, సాంఘిక రంగాన పేరు ప్రతిష్ఠలు అధికం కావటం గమనించగలరు.

♓ మీనం: మిత్ర సహాయం, ఆర్థిక లాభం, సాహితీ రంగాన అనుకూలత చేకూరటం, బంధువులు యింటికి రావటం గమనించనున్నారు. పాటివారి పోటీ కూడా అధికం కానున్నది. స్త్రీలకు: పదిమందిలో పేరు ప్రతిష్ఠలు తెచ్చికోవటం, ఆర్థికంగా మేలు సంపాదించటం జరుగుతుంది, గ్రహించండి, శ్రమించండి.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి ★

# వ్యక్తిగతం



సుప్రసిద్ధ చలనచిత్ర బహుమానం "ఆస్కార్ అవార్డ్"ని పొందిన మొదటి భారతీయ వ్యక్తి శ్రీమతి భానూ అత్థయ్య...



హునా (వయసు 19) చీనాదేశం తరపున టెన్నిస్ ఆడేది. పోయిన ఏడాది జూలైలో అమెరికా సంయుక్త రాష్ట్రాలలో తను అప్పటి దేశంకోసం ఆడుతూ దేశాన్ని మార్చుకున్నది. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో శరణు కావాలన్నది. ఎనిమిది నెలలపాటు తర్జన భర్జనలుచేసి అ. సం. రా. ప్రభుత్వంవారు చివరికి సరే, అన్నారు. చీనా ప్రభుత్వంవారికి ఈ నిర్ణయం నచ్చలేదని వేరే చెప్పాలా?



శ్రీమతి ప్రమిలా లెహంట్ బ్రిటన్‌లో టీచరు ఉద్యోగం చేస్తున్నారు. ఈవిడ వయసు 45 ఈమెని బ్రిటిషు కన్సర్వేటివ్ పార్టీవారు పార్లమెంటుకి తమ అభ్యర్థిగా ఎన్నుకున్నారు. కన్సర్వేటివ్ పార్టీవారు సాధారణంగా ఆసియా జాతులవారికి దూరంగానే ఉంటారు...



(గత సంచిక తరువాయి)

ఆమె తలవంచుకుని ఆవరణలో ప్రవేశించగానే భిక్షులుడు ఎగిరి గెంతాడు. అతడికి సంతోషం వర్ణనాతీతమయింది.

"ఏకవీరా! వచ్చావా?" అంటూ ఎదురు వెళ్ళేడు.

ఏకవీర అతనిని సాదరంగా పలుకరించి హుందాగా నడుస్తూ వసారాలోకి వచ్చింది. వెంకన్నదొర ఆమె గమనాన్ని నిశితంగా పరిశీలించటంలో మునిగిపోయాడు.

ఆయన హృదయం క్షణంసేపు కలుక్కుమంది. ఆమె ముగ్ధ. మునికన్య. ఆరాధించే ఆడపిల్ల. ఆమెకు ఎంతో భవిష్యత్తు ఉన్నది. తాను కర్కశంగా ఆమెను ఒక ఆటలో పావును చేయబోతున్నాడు. ఇది మనసులతో ఆడే ఆట. మనసు అద్దంలాంటిది. అది పగిలితే అతకదు. వెంకన్నదొరలో క్షణంసేపు మానవత్వం తాలూకు స్పందనలు అంకురించేయి. మరుక్షణంలోనే ఆయన కర్కశంగా మారేడు. ముఖం గంభీర ముద్రలో బిగించేడు.

ఏకవీర వంగి ఆయన పాదాలను తాకి లేచింది.

"తల్లీ నీకు శుభం కలగాలని కోరుతున్నాను" అన్నాడు దొర. తనకు ఇష్టం లేకుండానే ఆ మాట తన నోట వెంట వచ్చినందుకు తాను ఆశ్చర్యంలో మునిగిపోయాడు. ఇదేలా జరిగిందో ఎంత ఆలోచించినా ఆయనకు అంతుతేలలేదు.

ఏకవీర ముఖంలోకి చూస్తూ కర్కశంగా మాట్లాడటం ఎవరితరమూ కాదు అనిపించింది. ఇది ఒకందుకు మంచిదే. ఆమె తనమీద విశ్వాసం పెంపొందుతుంది. అది ఆమె మనసు భిక్షులుని మీద లగ్నం కావటానికి ఉపయోగపడవచ్చు. అది ఒకందుకు మంచిదే.

"అమ్మా భిక్షులుడిని చూసేందుకు వచ్చావా?" అడిగేడు దొర.

"స్వామిని చూసేందుకొచ్చేను."

"స్వామి ఎవరు?"

"వెంకన్నదొర" అన్నది ఏకవీర ఎంతో ఆత్మీయతతో. ఆ మాటలు వెంకన్నదొరకు క్షణకాలం భ్రాంతిని కలిగించేయి. వెంకన్నదొర అంటే తనేకదా! తనను చూడటానికి వచ్చిందా? తాను ఏకవీరకు స్వామి ఎలా అవుతాడు? ఏమిటీ మాట?

"భిక్షులా నా దొర సురక్షితమేనా" అన్నది ఏకవీర. వెంకన్నదొర తేరుకొచ్చేడు. ఇహ చెప్పేది భిక్షులునికి వేంకటేశ్వరునిమూర్తినిచ్చిందికాబోలు. ఆ రాత్రిమొక్క యోగక్షేమాలు అడిగేందుకు వచ్చిందికాబోలు. యదాకృతి తద్గుణః అని అంటారు కదా! ఇంత ముగ్ధ సుకుమారమూ, మనోహరమూ అయిన ఆకృతి వెనుక ఎంత పెద్ద ఆలోచనలున్నాయి? అని విస్తుపోయేడు దొర.

ఏకవీరను తీసుకుని భిక్షులుడు లోపలకు వెళ్ళేడు. రెండుగదులు దాటాక మధ్యగదిలో ఉయ్యాలబల్ల ఉన్నది. దానిమీద కూర్చున్న ఒక మధ్య వయస్కురాలు గంధం తీస్తోంది.

"అమ్మా! ఏకవీర వచ్చింది" అన్నాడు భిక్షులుడు. ఆమె తలెత్తి చూసింది. ఏకవీర ఆమెకు నమస్కరించింది.

"రా తల్లీ" అంటూ పిలిచిందామె. గౌరీదేవి ఆమె పేరు. ఏకవీర చలువరాయి పరచిన నేలమీద మెల్లిగా పాదాలుముందుకు వేస్తూ గౌరీదేవి చేరువలోకి వచ్చింది. "కూర్చో తల్లీ" అన్నదామె. ఆమె మాటలు చాల నిరాడంబరంగా నెమ్మదిగా ఉన్నాయి. ఆమె ఆకృతికూడ అలానే ఉంది.

తాము పెద్దవాళ్ళమన్న అతిశయం ఆమెలో కన్పించలేదు. ఏకవీర ఉయ్యాల బల్లమీద ఒదిగి వినయంగా కూర్చుంది.

"మా పిచ్చి నాగన్నను చూసేందుకు వచ్చావా?" అడిగిందామె.

"నా స్వామికోసమే వచ్చానమ్మా."

"ఏ స్వామికోసం తల్లీ!" ఆమె విస్తుపోయింది.

"వేడుకొన్న వారి వేల్పు శ్రీ స్వామి వెంకన్నదొర."

"ఏమిటో" అన్నది అర్థం కానట్టు కొడుకు ముఖంలోకి చూస్తూ. ఆమెకు వేంకటేశ్వరుని మూర్తి వృత్తాంతం తెలియదు.

"అమ్మా! నేను తెచ్చానే వేంకటేశ్వరుని మూర్తి" అంటూ ప్రారంభించేడు భిక్షులుడు.

"స్వామి మందిరంలో పెట్టి ఉన్నది అది నువ్వు తెచ్చిందేనా" అంటూ కొడుకును ప్రశ్నించిందామె.

**జరిగిన కథ — 4!** రుద్రాంబ, గణపతిదేవుల పరిపాలనా కాలంలో వెంకన్నదొర దగ్గర తన కుర్రబిడ్డలతో వెట్టిచాకిరి చేస్తుంటాడు హరిజనుడు నారాయణ. అతను కృష్ణస్వామి భక్తుడు. ఏకవీర కృష్ణస్వామి ఆశ్రమంలో పెరిగి పెద్దవుతుంది. శ్రీదేవుడనే శిల్పి శ్రీ వేంకటేశ్వరుని మూర్తిని చెక్కుతాడు. ఏకవీర స్వామిని ఆరాధిస్తుంది. ఆమె శ్రీదేవుడిని ఒక చిన్న స్వామి రూపును చెక్కమని కోరుతుంది. మొగలిచర్లలో శైవాచార్యుల సభలు జరుగుతాయని తెలిసి కృష్ణస్వామి వ్యాకులపడుతాడు. గూఢచారి త్రిపురాంతకుడు ఒక లేఖను కృష్ణస్వామికి అందచేయగా ఆయన దానిని చదివి భస్మీపటలం చేసి, మూడు తాళపత్రాలలో ఏదో వ్రాసి మహామంత్రికి ఉరుగల్లు పంపిస్తారు. వెంకన్నదొర తన కొడుకు భిక్షులుని పిలిచి ఏకవీరను ప్రేమించమని చెప్తాడు. భిక్షులుడు ఏకవీరతో తన ప్రేమను తెలుపగా అతని అమాయకతకు జాలిపడి శ్రీదేవుడు చెక్కిన చిన్నస్వామి రూపును భిక్షులునికిస్తుంది. అది చూచి శ్రీదేవుడు బాధపడతాడు. కృష్ణస్వామి పంపిన వార్తలు తాళపత్రాలను శివదేవయ్య కందించగా శివదేవయ్య పశుపతి మహాదేవులకు కృష్ణస్వామికి లేఖలు వ్రాయించి త్రిపురాంతకుని ద్వారా పంపిస్తాడు. పశుపతి మహాదేవులు లేఖనందుకుని కృష్ణస్వామి దగ్గరకు వెళతారు. కృష్ణస్వామి తనకు లొంగి వచ్చేలా ఉండాలంటే ఏకవీరను తన కోడలుగా స్వీకరించేందుకు ఎంతో ఉత్సాహంగా నటించాలనుకుంటాడు వెంకన్నదొర.

"అది ఏకవీర యిచ్చిందే..." అన్నాడు బిజ్జలుడు.

"చాల చక్కని రూపం తల్లీ" అన్నది ఏకవీర ముఖం చూస్తూ.

గౌరీదేవి నియమితమైన ఆలోచనలూ, ఆచారాలూ కల ఆవిడ. ఆమెకు వెంకన్నదొర చేసే ఆలోచనలు తెలియవు. గృహకృత్యాలు తీర్చిదిద్దుకోవటంతోనే ఆమెకు కాలం దొర్లి పోతుంది. ఇతర విషయాలు అంతగా పట్టించు కోదు. భర్తకు లోటులేకుండా తాను చేయగలిగిన దేమిటా ? అని ఆలోచించి ఆమె కొన్ని పద్ధతులు నేర్చుకుంది. వాటితోనే ప్రొద్దు యావత్తూ సరిపోతుంది ఆవిడకు.

"కృష్ణస్వామి ఆశ్రమం చూచి చాల కాలమయింది తల్లీ. మళ్ళీ ఒకసారి రావాలి అని వుంది. ఇంట్లో అన్ని పనులూ పురమాయించు కోవటం చేయించుకోవటమే సరిపోతుంది" అంటూ సంభాషణకు ఉపక్రమించిందామె. ఇది సాధారణంగా యిద్దరు గృహిణులు ఒకచోట చేరినప్పుడు సాగే సంభాషణ. వాటిల్లో అవివాహితులయిన యువతులూ పాల్గొంటారు. కాని ఏకవీర విషయం వేరు. ఆమె సాధారణ మయిన గృహిణి పెంపకంలో పెరగలేదు. కుటుంబంలో పెరగలేదు. ఆశ్రమంలో ఉండే విషయాలు తప్ప మిగిలిన విషయాలు తెలిసినా వాటిమీదకు ఆమె ఆసక్తి చూపదు. నవ్వి వూరుకుంది. గౌరీదేవి తల ఎత్తి చూచింది. ఆమెకు తాను చేయదలచిన సంభాషణలో విషయాన్ని మార్చటం అవుసరమనిపించింది.

"అమ్మా! నీవొక లేడికూనను పెంచు తున్నావటగా."

"అవునమ్మా! దాని పేరు పద్మ. చాల చిలిపి" అన్నది ఏకవీర.

గౌరీదేవమ్మకు అర్థమయిపోయింది.

ఏకవీర ఆలోచనలు వేరు. అభిరుచులు వేరు. ఆశ్రమ వాతావరణంలోని విషయాలే ఆమెతో సంభాషించాలి.



''అయితే అంత అందమయిన మూర్తిని ఎవరు చెక్కేరు ?''

''శ్రీదేవుడమ్మా !''

''పెద్దవరం గ్రామస్తులకు శిల్పాన్ని చేసి యిచ్చినవారేనా ?''

''అవును''

''అంతటి గొప్ప శిల్పి అలా పిచ్చివాడిలా వుంటాడేమమ్మా ?''

''మహాత్ములు మనలాగ ఎందుకుంటారు. వారి తీరులో వారుంటారు. అది చూచి మనం పిచ్చివాలకమే అనుకుంటాం'' అన్నది ఏకవీర.

ఇక దొరికిపోయావులే — నీచేత తెగ వాదించకపోతే చూడు అన్నట్లు పకపకా నవ్వసాగింది గౌరీదేవి.

### 7

ఏకవీర తల వొంచుకుని నడుస్తోంది. పాపం బిజ్జలుడు. తన మాట అంటే అతనికి వేదవాక్కు. తన మాట విని పశుపతిని ఆటలు పట్టించేడు అతని అమాయకత్వాన్ని తాను ఆసరా చేసుకుని ఆడించాలనుకుంటే అది మరొక విధంగా పరిణమించింది.

పండితునికి పది మందిలో అవమానం జరిగినందుకు బాధపడసాగింది ఏకవీర.

''అమ్మా ఎక్కడకు వొచ్చేవు ?'' ప్రశ్నించేడు నారాయణ. ఆమె అలా గ్రామంలో ఒంటరిలా తిరుగుతూ వుండటం అతడు చూడటం యిదే ప్రథమం. సంభ్రమం కలిగింది.

ఏకవీర సమాధానంగా తలఎత్తి నవ్వింది.

ఆ వీధి నిర్జనంగా ఉన్నది. పండితులు మందలించి వెళ్ళేక అతడు ఎక్కువ కాలం ఏకాంతంలో ఆత్మవిమర్శకు గురి అయ్యేడు. తనకు తెలిసీ ఏ తప్పూ చేయలేదు. తనకు తెలియకుండా మనసులో ఏదయినా కల్మషం ఉన్నదేమో ! కొడుకును కమతం నుండి విడుదల చేయించుకోవాలన్న కోరిక తనచేత యీ పని చేయించిందేమో !

ఏకవీర పలుకలేదు. ఆమెకుకూడా తానంటే జుగుప్స ఏర్పడిందా ? ఏమో !

''అమ్మా ! పలుకవెందుకని ?''

''నీతో నేను పలుకను.''

''ఎందుకని ?''

''నీమీద కోపం. అందుకని'' నారాయణ గతుక్కుమన్నాడు.

''ఎందుకమ్మా కోపం.''

''అవును కోపమే!''

''నేను అంత అపరాధం ఏమి చేశానమ్మా!''

''నీవు ఆశ్రమంలో కనిపించి ఎంతకాలమయింది.''

''రావటంల్లేదు తల్లీ,''

''అదే అడుగుతున్నాను. ఎందుకు రావటల్లేదు.''

''అదేనా నేను చేసిన అపరాధం.

''అవును'' అన్నది ఏకవీర. నారాయణకు కన్నులు చెమ్మగిల్లేయి. హృదయం ఆర్ద్రమయింది. ఏకవీర ప్రసాదించిన యీ వరప్రసాదం; సాక్షాత్తు భగవంతునికే మనసు అర్పించుకున్న యీ అమృతమయి హృదయం ఎంత కోమలమయిన తనను యిలా సర్వ ప్రపంచమూ తనను మానించి అసహ్యించుకున్నా యీమె ఆదరిస్తే చాలు. మనసుకు ఊరట కలుగుతుంది.

''ఆ అదృష్టం నాకు లేదు తల్లీ''అన్నాడు కన్నీరు ఒత్తుకుంటూ.

''నారాయణా! నీవు చాల మారిపోయేవు''

''మార్పు అనేది సృష్టి ధర్మం తల్లీ''

''తత్త్వశాస్త్రం చెప్పకు. నాకు సమాధానం కావాలి. చెప్పు. నువ్వెందుకు రాలేదు.''

''రాకూడదమ్మా''

''ఎందుకట ?''

''నేను జైనం స్వీకరిస్తానని వాగ్దానం చేశాను.''

''నువ్వా ?''

''అవును. ఏమి. ఎందుకు కాకూడదు ?''

''అసత్యం చెబుతున్నావు''

''లేదమ్మా. నిజమే చెప్పాలని ప్రయత్నం చేస్తున్నాను.''

''ఏమిటి ఆ నిజం ?''

''నేను హైందవం విడనాడుతున్నాను.''

''అది నీకు కావాలంటే వొచ్చిందా ?''

''లేదు''

''మరి ఒద్దనుకుంటే పోతుందని ఎలా అనుకున్నావు''

''తప్పదు తల్లీ నేను జైనం స్వీకరించక తప్పదు''

''పరిస్థితుల ప్రాబల్యమన్న మాట''

''నిజమే !''

''ఏమిటా పరిస్థితులు ?''

''వివరించలేను.''

''నీవు పిరికిపందవు కూడా అయ్యేవు కదా నారాయణా !''

''లేదమ్మా ! నేను చచ్చిపోయాను.''

''అలా జరుగదులే. నిన్ను కాపాడమని భగవంతుడిని ప్రార్థిస్తాను.''

''కొండంత ధైర్యాన్ని కొంగున ముడివేసుకున్న కోమలివి. నీ అమృత వాక్కులు నా ఆయుర్దాయాన్ని పెంచుతాయి. కాని నాకు యీ దురదృష్టకరమయిన జీవితాన్ని పొడిగించాలని లేదమ్మా.''

''నైరాశ్యంలో వుండి కూడ నీవే కర్తవు అయినట్లు మాట్లాడుతున్నావు.''

''కర్తను కానమ్మా. కోరుకుంటున్నాను ''











# మీపాపాయి సంక్షేమమే మాముఖ్యఆశయం

ప్రపంచవ్యాప్తంగా డాక్టర్లంతా తల్లి పాలను పసిపాపలకు కావలసిన పోషక పదార్థాలతో పాటు, రోగ నిరోధక శక్తిని పరిపూర్ణంగా యిచ్చే పౌష్టిక ఆహారంగా అంగీకరించారు.

తల్లి పాలు సమృద్ధిగా లేనప్పుడు పాపాయికి 'విజయ స్ప్రే' వంటి 'శిశు ఆహారం' ఇవ్వడం మంచిది. సెంట్రల్ ఫుడ్ టెక్నలాజికల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియావారి ఫార్ములాను అనుసరించి విజయస్ప్రేను స్వచ్ఛమైన పాలు, విటమిన్లువంటి పోషక పదార్థాలతో కలిపి రూపొందించారు. లోపల పక్కాగా సీలు వేసి. ఇండియన్ స్టాండర్డ్స్ ఇన్‌స్టిట్యూషన్ మరియు కౌన్సిల్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రీసెర్చి ఆఫ్ ఇండియావారి అనుమతి పొంది మీ వద్దకు వస్తోంది. మీ పాపాయికి కావలసిన అన్ని పోషక పదార్థాలతో శాస్త్రీయంగా అత్యంత శ్రద్ధతో ఉత్పత్తి చేయబడుచున్న అమూల్య ఆహారం.

## విజయస్ప్రే

తల్లిపాలు పసిపిల్లలకు అత్యుత్తమమైనవి.

శిశు సంక్షేమం కోరి విడుదల చేసినవారు ఆంధ్రప్రదేశ్ పాడిపరిశ్రమాభివృద్ధి సహకార సమాఖ్య లిమిటెడ్
విజయ స్ప్రే తయారు చేయువారు

FDS APDDCFL 38 83 Tel

## తిరు చరణాలు

''ఎందుకు జీవితం మీద ఇంత నిరాశ చెందేవు నారాయణా !''

''ఆ జీవితం నేర్పిన పాఠమ్.''

''నీవు హైందవాన్ని విస్మరించుతావంటే నేను నమ్ముతాననుకున్నావా ? ఎవరికోసమో త్యాగం చేస్తున్నావు'' అన్నది ఏకవీర. నారాయణ విలపించసాగేడు. 'చిన్న పిల్లవు. అయినా నా హృదయ గీతాన్ని గ్రహించగలిగావమ్మా' అనుకున్నాడు మనసులో.

''నారాయణా ! నీ పిలుపుకోసం ఆశ్రమం ఎదురుచూస్తూ వుంటుంది. లక్ష్మి, పద్మ ఎదురుచూస్తూ వుంటాయి. నీకు నీ స్వధర్మం రక్షణ కల్పించగలదన్న విశ్వాసం కలిగినప్పుడు సిగ్గుపడకుండా రా'' అంటూ ముందుకు సాగిపోయింది ఏకవీర.

నారాయణ ఆగిపోయాడు. ఆమె వెనుక నుండే ఆమె చూడకుండానే నమస్కరించేడు. ఏకవీర వొంచిన తల ఎత్తకుండాపోతూవుంది.

ఏకవీర దేవీ ఆలయం ముందుగా వెడుతోంది. ఆలయం ముందు జనం క్రిక్కిరిసి ఉన్నారు. ముఖ ద్వారం మూసి ఉంది. ఏకవీర లోపలకు వెళ్ళాలంటే ముఖద్వారం ప్రక్క ఉన్న ఉపద్వారాలలోంచిపోవాలి. అవి అర్చకులూ, పనివాళ్ళూ పోయేందుకు నిర్మించిన ద్వారాలు. అవి ఎప్పుడూ తెరిచే ఉంటాయి.

ఏకవీర లోనికి వెళ్ళింది.

ఆలయాలకు వెనుక యాత్రికుల కోసం చిన్న చిన్న బసలు నలభైదాకా ఉన్నాయి. వాటిలో ఎప్పుడూ ఎవరో యాత్రికులు ఉంటూనే ఉంటారు. వారికోసం ప్రత్యేకంగా బావి వుంది.

ఏకవీరా దేవి ఆలయానికీ, కేదారేశ్వరస్వామి ఆలయానికి మధ్య సన్నని సందు ఉన్నది. ఏకవీరకు ప్రదక్షిణలు చేయాలంటే ఆ సందులోంచి వెళ్ళాలి.

ఏకవీర బావిదగ్గరకు వెళ్ళి పాదప్రక్షాళనం పూర్తిచేసుకుని ఆ సన్నని సందులోంచి వొస్తోంది. ఆ సందు దాదాపు సగానికి వొచ్చేక ఏకవీరకు అడుగు ముందుకు పడలేదు . పరధ్యానంగా నిలిచిపోయింది. ఆమె మనసులో ఏ భావమూలేదు. శూన్యంగా ఉంది. ఆలయంలోకి వచ్చినప్పటి నుండీ ఆమెనే గమనిస్తున్న అర్చక స్వామి ఒకరు ఆమె అలా చాలసేపు నిలబడిపోవటం గమనించేడు. ఆయన వృద్ధుడు. బాగా తల పండినవాడు. దగ్గరగా వొచ్చేడు.

''ఏమి తల్లీ అలా నిలిచిపోయేవు'' అని ప్రశ్నించేడు.

ఏకవీర పరధ్యానంగానే తల ఎత్తి అర్చక స్వామిని చూచింది. నమస్కరించింది.

''ఏమిటమ్మా పరధ్యానమూ'' చిరునవ్వుతో అడిగేడు అర్చక స్వామి.

ఆమె చిరునవ్వు నవ్వి వూరుకుంది.

"ఏమి ఆలోచిస్తున్నావు తల్లీ"

"చావు పుట్టుకల గురించి"

""'జాతస్య హి ధృవో మృత్యుః ధృవం జన్మ మృతస్యచ"

"మనిషి యీ వలయంలో ఎందుకు పడిపోవటం"

"కర్మబద్ధుడు తల్లీ. ప్రారబ్ధము. సంచితము, ఆగామి అని మనిషి బ్రతుకును వెన్నంటే కర్మలు మూడు ఉన్నాయి. వాటికి బద్ధమై అవి నిర్దేశించినట్లు నడిచేది జీవితం"

"అయితే బ్రతుకులో స్వతంత్రం ఏమి ఉన్నది"

"తల్లీ నీవు సాక్షాత్తు ఏకవీరాదేవి ప్రసాదించిన వరప్రసాదానివి. నీకు నేనేమి చెప్పగలను"

"అవును స్వామీ! నేను దేవి వరప్రసాదాన్ని. నాకు తలిదండ్రులులేరు" అన్నది ఏకవీర. ఆమె కన్నులు ఆర్ద్రమయ్యాయి. అది గమనించాడు అర్చకస్వామి.

"అమ్మా! నీకు కృష్ణస్వామి లేరా?"

"ఆయనతో అనుబంధం ఏ కర్మవల్ల సంప్రాప్తమయిందో"

"ఇంత చిన్నవయసులో అంత విషాదం ఎందుకమ్మా!"

"అదికూడ కర్మత్రయంవల్ల దొరికిందే"

"దేవిని దర్శించుకో తల్లీ! మనసుకు శాంతి దొరుకుతుంది" ఆమెను అక్కడనుండి కదిలించాలని ప్రయత్నించేడు అర్చకస్వామి.

"స్వామీ! దేవి యిక్కడ లేదా!"

"ఎందుకు లేదమ్మా! ఉన్నది. నీవే సాక్షాత్తు ఏకవీరాదేవివి."

"మనసును నిద్రపుచ్చేందుకు అది మీరు నాకు కల్పించాలనుకుంటున్న భ్రాంతి. కాని ఆ భ్రాంతి నాకు కలగటల్లేదు."

"అమ్మ యిచ్చిన ప్రసాదమేగా తల్లీ నువ్వు"

"అలా అనుకోవటం అవసరమయింది."

"మరి నువ్వు"

"అనాథనని మీకూ తెలుసు. కాని చెప్పరు."

"ఈ సందేహం నీకు యిప్పుడే ఎందుకొచ్చిందమ్మా."

"ఏమో స్వామీ! ఇక్కడకు రాగానే నేను అనాథననే విషయం నాకు జ్ఞాపకానికి వస్తుంది."

"అందుకోసం బాధపడాలా?"

"నేనేమీ బాధపడలేదే. నేను అనాథను అయినంతమాత్రంచేత కర్మబద్ధురాలిని కాకుండా పోతానా! అమ్మా నాన్నా అందరూ ఉన్నవారు కర్మనుంచి తప్పుకోగలుగుతారా? ఎవరైనా వలయంలోపడి తిరగవలసినవారే! ప్రత్యేకంగా నాకెందుకు బాధ?" అన్నది ఏకవీర.

అర్చకస్వామి గగుర్పాటు చెందేడు. తన కళ్ళముందు ఇంత గుడ్డుగా యీ చోటునే దొరికిన యీ పసికందు ఎంత వేదాంతం చెబుతోంది? ఎంత ఆశ్చర్యం?!

"అవును తల్లీ! కర్మబద్ధమయిన యీ జీవితంలో అందరూ ఒంటరివారే. కర్మకృతాన్ని కాన్ని, కర్మఫలాన్నికాని, కర్మ నేతృత్వాన్నికాని పంచుకునేవారు ఎవరున్నారు. ఈ సత్యాన్ని తెలుసుకునే బోయ వాల్మీకి అయ్యేడు. ఎవరి కర్మ వారిది అనటం ఇదే!" అన్నాడాయన.

"అయితే ఆచార్యా! నాదొక సందేహం."

"నీకు చెప్పగలిగితే నాకు గర్వకారణమే! అడుగు తల్లీ."

"ఈ జీవితం అంతా దైవసంకల్పమే అయి, కర్మబద్ధమే అయితే మానవుడికి మళ్ళీ ఎలా అంటుతున్నది."

"అర్థంకాలేదు తల్లీ."

"భగవంతుడి సంకల్పానికి అనుగుణంగానే మనం అన్నీ చేస్తున్నప్పుడు మంచిచెడులలో మనకేమిటి నిమిత్తం. దాని ఫలితం మనకేం అంటుతున్నది" అంటూ ప్రశ్నించింది ఏకవీర.

"నేను చెప్పలేను తల్లీ! నీవు అడిగింది చాల జటిల సమస్య."

"నేను యింతింత విషయాలు మాట్లాడమే మీకు విడ్డూరంగా ఉండి అలా అంటున్నారు కాని మీకు తెలియనిది ఏముంది?"

ఆమె చెప్పింది యదార్థమే! వేదాంత శాస్త్రాన్ని కుణ్ణంగా అధ్యయనం చేసిన మహా పండితుడాయన. ఏకవీర చిన్నపిల్ల అనీ, ఆమెకు ఎటువంటి గహనమైన విషయాలను వివరిస్తే ఆమెకు అర్థంకాక వికటిస్తాయని భావించాడాయన. అందుకనే దాటవేసేరు. ఏకవీర నిలువరించి అడిగేసరికి తప్పుకుని పోలేకపోయేడు.

"అర్థమయింది తల్లీ. శివుని ఆజ్ఞలేకుండా చీమయినా కుట్టదు. అన్నీ అతని సంకల్పంవల్లనే జరుగుతున్నాయి. మానవుడు తన జీవితంలో మంచీచెడూ అన్నీ ఆయన సంకల్పం వల్లనే చేస్తున్నాడు. అటువంటప్పుడుదాని ఫలితాంశాన్ని మానవుడు ఎందుకు అనుభవించాలని కదూ అడుగుతున్నావు. దీనికి కారణం అహంకారమే తల్లీ. ఆయన నుండి నీవు వేరుపడి ఆలోచిస్తున్నావు కనుక నీకలా అనిపించింది. నీకు ఏది ఏమిటో తెలియని భ్రాంతి కలిగింది. నీవు నీ అహంకారాన్ని స్వామికి సమర్పించి ఆలోచించు. నేను అనేది లేకపోతే అనుభవించేదికూడ ఆయనే అవుతాడు. అప్పుడు నీకు యీ సందేహం ఉదయించదు. చేయాలని సంకల్పించేది అతడే. చేసేది అతడే. అనుభవించేది అతడే. అదే అతని క్రీడ." ఆగిపోయాడు. ఏకవీరకు విషయం అర్థమయిందా లేదా అని సందేహం కలిగింది.

ఏదో మరచిపోయినట్లుగా "ఏమి చెప్పాను తల్లీ" అన్నాడు.

"అహంకారాన్ని స్వామికే సమర్పించగలిగితే అనుభవించేది నేను కాదని అతడే అనీ అర్థమవుతుందని చెప్తున్నారు" అంటూ ఆయన చెప్పిన విషయాన్ని సంక్షిప్తీకరించింది ఏకవీర.

అర్చకస్వామికి సంతోషం కలగటమేకాకుండా ఆమెకు ఎంత గహనమయిన విషయాలయినా చెప్పవచ్చునన్న విశ్వాసం కలిగింది.

"అహంకారం నశించటమా— నశించకపోవటమా అనే విషయానికి కూడ కారణం మీరు చెప్పిన కర్మ అయినప్పుడు—" అన్నది.

"అవును తల్లీ. అహంకారనివృత్తి అనేది కర్మనుబట్టి అనుసరిస్తుంది. అహంకార నివృత్తి జరగకపోవటం కర్మనుబట్టే అయినప్పుడు






## తిరుచరణాలు

అనుభవమయిన భ్రాంతి మనిషికి ఎందుకు కలగాలని ప్రశ్నిస్తున్నావు. నా పాండిత్యానికి ఒరిపిడి పెడుతున్నావు తల్లీ. అందుకే నీవు ఏకవీరాదేవికి అపర రూపమే అన్నావు. నా వాక్కును నీవు నిజం చేశావు తల్లీ'' అన్నాడు సంతోషంచేత శరీరమంతా పులకించిపోగా.

''చెప్పండి స్వామీ, అహంకార నివృత్తి అనే సంకల్పం ఆయన చెయ్యినప్పుడు (కర్మ బద్ధం అయినప్పుడు) భ్రాంతి అనే ఫలితం మన కెందుకు కలుగాలి?''

''అద నీకు కలుగలేదు తల్లీ. కలుగటమనే భ్రాంతిలో నీవు పడిపోతున్నావు. మళ్ళీ యీ భ్రాంతికి పుట్టుక స్థానం కూడా అహంకారమే అయినప్పుడు తప్ప అహంకారానిది అవుతుందా? విధాత సంకల్పానిది అవుతుందా ఆలోచించు'' అన్నారు అర్చకస్వామి.

''అహంకారానిదే అవుతుంది'' అన్నది ఏకవీర.

''నీ సందేహం తీరినట్లేనా తల్లీ.''

''కృతజ్ఞురాలిని.''

''నేనే నీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలమ్మా''

!'ఎందుకు ?'' అన్నది ఏకవీర ఆశ్చర్యంతో నేత్రాలు విశాలంచేసి.

''సుప్త భుజంగాలను కదిలించావు.''

''అవి వికటించే అవుషధాలను ప్రసాదించాయి.''

''చాల జాగ్రత్తగా ఉపయోగించాలమ్మా. గరళంతో పోయే ప్రాణాలను నిలుపుకోవచ్చు. విలిచిఉన్న ఊపిరులు తీసుకోనూవచ్చు.'' ఏకవీర సంతోషంతో వొంగి ఆయన పాదాలను తాకి లేచింది.

''తల్లీ, దేవి దర్శనానికి రావూ.''

''స్వామీ మీరు అన్నీ తెలిసినవారు. ఇక్కడకు రాగానే నాకు మనసు నిలిచినట్లు అవుతుంది. ఇక్కడే నిలిచిపోవాలనిపిస్తుంది. ముందుకు పోవాలనిపించదు. కారణం ఏమిటి ?'' అన్నది.

ఏకవీరకు అమ్మా నాన్నా లేకపోవటం తెలుసు. కనుక తాను అనాధనని భావిస్తుంది కాని అనాధ ఎందుకయిందో, ఎలా అయిందో, ఎక్కడనుండి ఆశ్రమంలోకి తాతయ్య ఒడిలోకి వొచ్చిపడిందో తెలియదు. ఆ విషయం తెలిసి వుంటే ఇప్పడీ ప్రశ్న వెయ్యదు.

ఆమె వృత్తాంతం ఆమెకు తెలియదన్న మాట.

''అందులో ఆశ్చర్యమేమీలేదమ్మా''అన్నారు అర్చకస్వామి.

''ఏమిటది ?'' ఏకవీర ఆతృతతో ప్రశ్నించింది.

''నువ్వు ఇక్కడే దొరికావమ్మా! కృష్ణస్వామి ప్రాతఃకాల పూజకువొచ్చినప్పుడు నీవు పొత్తిళ్లలో పడివున్నావు. ఆ ఏకవీరాదేవి నిన్ను ప్రసాదించిందని తలపోసి ఆనాడు ఆయన నిన్ను అక్కున చేర్చుకున్నారు. అక్కడే ఎదిగావు. కనుకనే ఇంతదానివి కాగలిగావు'' అన్నారు అర్చకస్వామి.

''యీ దేవి నాకు నా అన్న బంధం లేకుండా చేసిందన్నమాట.'' అన్నది నిర్లిప్తంగా. అర్చకస్వామి హృదయం కోతపడింది. తాను పొరపాటు చేశానేమోనన్న సందేహం మనసుమ మెలివేసింది.

''ముందుకుపోకుండా లాగేందుకే గదమ్మా మాకున్న బంధాలన్నీ'' అంటూ ఆయన ఊరడించాలని ప్రయత్నించేడు.

''నేను ఎటుపోవాలనే విషయం నా నిర్ణయంలోలేదు. దేవి ఆ విషయాన్ని తానే నిర్ణయించేసిందన్నమాట'' అన్నది ఏకరవీర నిట్టూర్పుతూ.

''అలా జరిగిందికనుకనే నీవు అహంకారాన్ని ఇంత శులభంగా జయించగలిగావు తల్లీ''అంటూ వివరించేడు ఆయిన.

''స్వామీ నా ధర్మాన్ని నేను నిర్వర్తించే మనోధైర్యం నాకు కలిగేలా ఆశీర్వదించండి'' అంటూ మరోమారు ఆయన పాదాలను తాకింది ఏకవీర. ఆమె శిరస్సుమీద చేయి ఆనించి బుజం పట్టుకుని ఆప్యాయంగా నిలిపేడు. ఆయనకు ప్రపంచాన్ని జయించినంత సంతోషం కలిగింది.

''ఏకవీరాదేవి అపరావతారమైన నీకు మనోధైర్యం ప్రసాదించేటంత శక్తివంతులు ఎవరున్నారమ్మా. అందరికీ శక్తిని ప్రసాదించే శక్తిస్వరూపిణివి నీవు'' అంటూ వినయం ప్రదర్శించేడాయన.

ఏకవీర ఆలయం నుండు అడుగు బైట పెట్టిందామె. పని వాళ్లంతా పేరు పేరున పలకరించేరు. అక్కడ పనిచేసే వృద్ధులకంతా తెలుసు ఆమె జన్మ వృత్తాంతం. అందువల్ల ఆమె మీద వారికి ఎనలేని ఆప్యాయత. ఎవరికి వారికి తమ స్వంత బిడ్డలాగే అనిపిస్తుంది ఏకవీర.

కాలాతీతమయిపోతోందని ఆమె మరి ఎవరి దగ్గరా ఆగలేదు. ఆశ్రమాభి ముఖంగా అడుగులు చురుకుగా వేయసాగింది.

''ఇంతసేపు ఎక్కడకు వెళ్లేవమ్మా'' అంటూ పలకరించాడు కృష్ణస్వామి. తల వొంచుకుని తదేకదీక్షతో నడుస్తున్న ఏకవీర ఉలికిపడి తల ఎత్తి చూచింది.

రసాలంక్రింద తిన్నెమీద ఆశీనులై ఉన్నారు కృష్ణస్వామి. ఆయనకు ఒక ప్రక్కన పశుపతి ఆశీనుడై ఉన్నాడు. అతడు మింగివేసే చూపులతో చూస్తున్నాడు.

ఎదురుగా బిజ్జలుడు బితుకు బితుకుమంటూ నిలబడి ఉన్నాడు. అతడింతవరకూ

చెరలో బంధించినట్లుగా మహా యిబ్బందిపడి పోతున్నాడు. యిప్పుడు ఏకవీరను చూడగానే కొండంత ధైర్యమయింది. సంతోషంతో పొంగి పోయాడు.

"ఏకవీరా! ఏకవీరా! చూచావా యీ పండితులవారు ...?" అంటూ ఆరోపించేడు. ఏకవీరకు నవ్వాగలేదు.

"ఆమెను రానివ్వు నీ భరతం పడతాను" అంటూ పళ్లు నూరుతున్నాడు పశుపతి. బిజ్జలుడు మళ్లీ ఒణికిపోసాగేడు.

ఏకవీరకు విషయం అర్థమయింది. బిజ్జలుని వెంట తరిమి పరిగెత్తిన పశుపతి బహుశా ఎవరి సాయంతోనో బిజ్జలుడిని పట్టు కున్నాడు. అదీ యీ ఆశ్రమం ప్రాంతాలనే అయి వుంటుంది.

వెంటనే కృష్ణస్వామి వద్దకు ధర్మం కోసం వొచ్చాడు. బహుశా బిజ్జలుడు తానే అలా చెప్పమన్న సంగతి బైటపెట్టి వుండడు. అందు వల్ల యథార్థం తెలుసుకుందుకు పద్మగంధికి కబురుచేసి వుంటారు. అందుకే పండితుల వారు ఆమెను రానివ్వు నీ భరతం పడతాను అంటు న్నారు. పెద్దగొడవే అయిందన్నమాట.

"గ్రామంలోకి వెళ్లివొచ్చేను తాతయ్యా" అంటూ కృష్ణస్వామికి ముందు సమాధానం యిచ్చుకుంది ఏకవీర. ఆమె అలా అంటూ వుండ గానే పద్మ వచ్చి నోటితో ఆమె చేలాంచలాన్నిపట్టి లాగసాగింది. ఏకవీర మొదట అలక్ష్యం చేసింది కాని పదే పదే అది అలా తనను లాగటం ప్రారంభించేసరికి ఆమె వెనుదిరిగింది.

పద్మ కళ్లవెంట నీరు కారుతున్నాయి. అది ఏకవీర చూడలేని దృశ్యం. ఎటువంటి బాధ నయినా ఆమె భరించగలదు కాని పద్మకానీ, లక్ష్మికాని కన్నీరు పెట్టుకుంటే చూచి ఓర్వలేదు. పరుగు పరుగున దాని వెంట పోసాగింది.

పద్మ ఆమెను తోటలో మూలగ ఉన్న ఒక ఉసిరికచెట్టు క్రిందకు తీసుకుపోయింది. ఆ చెట్టు ప్రక్కన మాలతో మాధవం అల్లుకుని ఏర్పడిన లతానికుంజం ఉన్నది. దానిలోపడి ఉన్నది లక్ష్మి.

దాని ఉచ్ఛ్వాస నిశ్వాసాలు క్రమబద్ధంగా లేవు. కళ్లు తెరచి ఉంది. పొట్ట బాగా ఉబ్బె త్తుగా కాళ్లు నలిగి ఉన్నాయి. రెప్పపాటు ఉంది. ఏకవీరను చూడగానే అది లేవాలని ప్రయత్నం చేసింది. కాళ్లు వంగకపోవటంతో అది సాధ్యం కాలేదు. ఏదో తినకూడని వస్తువేదో తిన్నదనీ దానికి వాతం ప్రకోపించి అలా అయిందనీ గ్రహించింది. ఏకవీర.

వెంటనే పరుగు పరుగున తోటలో మరో మూలకు వెళ్లి వాయుమొక్కల ఆకులూ, అతి మధుర వేళ్లూ తుంపుకొచ్చి తినిపించసాగింది. మొదట్లో లక్ష్మికి దవడలు బాగా ఆడలేదు. ఏక వీర తన మృదువు అయిన చేతులతో ప్రేమ





నిండిన చూపులతో దాన్ని లాలించి మెల్లగా మొత్తం తినిపించింది.

అలా కాస్సేపు దానికి సేవలు చేశాక కాళ్లు ముడుచుకోవటం తోక ఊపటం ప్రారంభిం చింది లక్ష్మి. పద్మ సంతోషంతో గెంతులువేయ సాగింది. ఏకవీర దానిని అలా వొదిలి మళ్లీ కృష్ణ స్వామి దగ్గరకు బయలుదేరింది. పద్మ ఆమె వస్త్రాంచలాన్ని పట్టుకుని వెంటనే రాసాగింది. లక్ష్మి ఒంటరిదయితే అధైర్యంతో మళ్లీ కృంగి పోతుందన్న అనుమానంతో లేడి కూనను దానికి తోడుపంపి ముందుకు నడవసాగింది.

తను ప్రియాతి ప్రియంగా పెంచుకుం టున్న లేడికూన పద్మకానీ, ఆవుదూడ లక్ష్మిగానీ బాధపడితే ఆమె మనసుకు గాయమౌతుంది. మానవ విలాసాలకు దూరంగా వెలుపల వుండే ఆ తోటలో పద్మ,లక్ష్మి, ఆమెకు తోడు. నీడ. అన్నీ.

ఆమె మామిడిచెట్టు క్రిందికి వొచ్చేసరికి ఒక అప్సరసలాంటి అపూర్వ సౌందర్యరాశి కృష్ణ స్వామికి శేతులు జోడించి నిలిపడింది. ఆమె రంభలా వుంది. ఊర్వసిలాఉంది. మేనకలాఉంది. ఇంకా చెప్పాలంటే వారికన్నకూడ అందంగాఉంది. ఖచ్చితంగా చెప్పాలంటే పద్మగంధిలా ఉంది.

అవును. ఆమె పేరే పద్మగంధి. అపూర్వ సౌందర్యరాసి వయసు కొంచెం ఎక్కువే. ముప్పయి అయిదుదాటి నలభయి దాటకుండా ఉంటుంది వయసు. కాని ఆమె సౌందర్యపోషణవల్ల వయసు మరుగున పడిపోయింది. వీలయినంత తక్కువ అలంకారాలతో ఆమె ఆశ్రమానికి వచ్చింది. అయినా ఆ నిగారింపు తగ్గలేదు.

ఇటీవల విజయవాడ సమీపంలోని గొల్లపూడిలో భరతనాట్య రీతిలో శివతాండవ నృత్యాన్ని ప్రదర్శించిన బాలుడు చి. అడుసుమిల్లి ఎస్. ఆర్. రాజేష్.



కృష్ణస్వామి మౌనిలా కూర్చుని ఉన్నారు. పసుపతి పళ్లు నూరుతూ బిజ్జలునికేసి చూస్తు న్నాడు. బిజ్జలుడు బక్కచిక్కిపోయి పద్మగంధిని చూస్తున్నాడు. పద్మగంధి అప్పుడే వచ్చిన ఏక వీరను చూచింది. ఏకవీర మీద ఆమె క్షణంసేపు చూపు నిలిపింది. అలా చూస్తున్నప్పుడు ఆమె కళ్లలో నీలినీడలు కదలాడసాగేయి. కాస్సేపటికి ఆనందం తాలూకు మెరుపులు కనిపించేయి.

"తాతగారూ! పద్మగంధిని ఎప్పుడు పిలిచేరు?" అడిగింది ఏకవీర.

"నేనే పిలిపించేనమ్మా" అన్నారు కృష్ణ స్వామి.

"లక్ష్మి మాలతీమాధవ నికుంజంలో పడి పోయింది. బహుశా ఏదో చేయకూడని పని చేసింది. ఏదో తినకూడనిది తిన్నదికాబోలు. మీరు వెళ్ళిచూడండి తాతగారూ" అంటూ ఆయన కూర్చున్న ఆ తిన్నెమీదకు చేరింది ఏకవీర. అది ధర్మసింహాసనంలాంటిది.

పండితులవారు కొంచెం అవతలకు జరిగి కూర్చున్నారు. కృష్ణస్వామి లక్ష్మికి జబ్బుచేసిం దని తెలియగానే లేచివెళ్ళేరు.

"పశుపతిగారూ! మీరు పద్మగంధిని ఎందుకు పిలిచేరు" అంటూ సంభాషణ ప్రారం భించేసింది ఏకవీర. బిజ్జలుడి వొణుకూ భయమూ అన్నీ వొదిలిపోయాయి. ఉల్లాసంతో వేడుక చూడసాగేడు.

"ఈ బిజ్జలుడు... త్రాష్టుడు... నా పరువు తీసేడు" అన్నాడు పశుపతి పళ్ళు పేళ్ళు లేచిపోయేలా నూరుతూ.

"మీరు పొరపడ్డారు పశుపతీ. యీ పొరపాటు చేసింది నేను. ఈ శిక్ష నాకు వెయ్యండి" అన్నది ఏకవీర.

పశుపతి ఆశ్చర్యంతో నోరుతెరచి "అమ్మా! ముసిలిపీనుగ వీడని వేడుక పట్టిస్తున్నావా? నాకు తెలుసు. నీవు బంగారు తల్లివి. అలాంటి తుంటరి పనులు చేయవు. వీడే యీ బిజ్జలుడే.." అంటూ విజృంభించి బిజ్జలునిమీదికి దూక బోయేడు పశుపతి.

ఈ హఠాత్సంఘటనతో లేడిపిల్లలా బెదిరిన బిజ్జలుడు మళ్ళీ పరుగు లంకించు కున్నాడు. అతడు దొరికిపోయాడన్న భయంతో పరుగిడుతున్నాడనీ, అలా వొదిలేస్తే తనకు న్యాయం దొరకదనీ భావించిన పశుపతి అతన్ని వెన్నంటి తరిమేడు పట్టుకుందుకు. ఇద్దరూ మళ్ళీ వీధిన పడ్డారు.

"అమ్మా! నన్ను క్షమించు. యీ పొరపాటు తుంటరిపని నేనే చేసేను. ఇంత అవుతుందనుకోలేదు. బిజ్జలుడిని వొదిలించు కునేందుకే అలా చేసేను" అన్నది ఏకవీర.

"అమ్మా!!! ఏదితల్లీ మరొకసారి అలా పిలువు.

"అమ్మా!!"

# రాయబారం

శాస్త్రుల్లు



ఆప్పటికి నేను డిప్యూటీ కలక్టరుగా రిటైరయి ఒక నెలరోజులవుతుందేమో. ఆ రోజు ఉదయం కాఫీ తీసుకుని పేపరుచూస్తూ యీజీ ఛైర్లో కూర్చుని ఉన్నాను.

"ఏమండీ! యిది విన్నారా? రమాదేవి పెళ్ళి ఆగిపోయిందిటండీ" అని ఆశ్చర్యంగా చెప్పింది శ్రీమతి నా దగ్గరకు వచ్చి.

నేను నిర్ఘాంతపోయేను.

"ఏం! ఎందువల్ల!"

"ఏమో తెలియదండీ. విన్నరాత్రే వచ్చేరుట పాపం గోపాలరావుగారు ఊరినుండి. వారి పనిమనిషి యిల్లా వెడుతూ యిప్పుడే చెప్పింది."

గోపాలరావుగారు ఆ ఊరిలోని సంపన్న గృహస్థుల్లో ఒకరు. బాగా చదువుకున్నవారైనప్పటికీ పిత్రార్జితం బాగా కలవారవడంచేత ఉద్యోగం చేయడం యిష్టంలేక స్వంత ఊరిలోనే వ్యవసాయం చూసుకుంటూ ఉండిపోయేరు. ఆయన భార్య సావిత్రమ్మ ఉత్తమ యిల్లాలు. చాలా ఉన్నతాశయాలుకల ఆ దంపతులు ఆ ఊరిలో చాలా పేరు ప్రఖ్యాతులు సంపాదిం సుఖంగా కాలం గడుపుకుంటున్నారు. వారికి ుకలేక కలిగినబిడ్డ రమాదేవి. ఆ ఊరిలోనే కాలేజీలో బి. యే. ప్యాసయ్యింది. చాలా అందమైనదీ, సరళమైన స్వభావం కలదీను ఆమె. ఆ బిడ్డను చూసుకుని తల్లి దండ్రులు ప్రాణాలన్నీ ఆమెపై పెట్టుకునే కాలం గడుపుతున్నారు. ఈ మధ్య ఆమెకు వివాహం చేయాలని చేసిన ప్రయత్నం ఫలించిందనీ, రూపవంతుడూ, మంచి ఉద్యోగంలో ఉన్నవాడూ అయిన వరుడు లభించేడనీ, వారం రోజుల క్రితం కనపడినప్పుడు నాతో చెప్పేరు గోపాలరావుగారు. వివాహ ముహూర్తం కూడా చాలా దగ్గర్లోనే ఉందనీ ఆ ప్రయత్నాల్లోనే తను ఉన్నాననీ ఎంతో ఆనందంగా అన్నారు. కాని యింతలో యీ ఉపద్రవ మేమిటో నా కర్థం కాలేదు. ఈ వార్త కనక నిజమైతే యింక రమాదేవికి వివాహం చేయగలరా రావుగారు? ఆడపిల్ల పెళ్లి ఆగిపోయిందంటే మళ్లీ ఆమెకు వివాహం నిశ్చయించడం యిప్పటి సంఘంలో ఎంత కష్టమో నాకు తెలుసును.

వెంటనే చొక్కా, కండువా వేసుకుని గోపాలరావుగారింటికి వెళ్లేను. ఆయనా, భార్యా లోపల ఉన్నారు. నేను వచ్చేనని తెలిసి గోపాలరావుగారు సావిట్లోనికి వచ్చేరు.

"నమస్కారం రావుగారూ!"

"నమస్కారమండీ. దయచేయండి." అంటూ కుర్చీ చూపించేరు కూర్చోమని. ఆయన చాలా దిగులుగా ఉన్నారు.

"రావుగారూ! ఏదో వార్త విన్నాను యిప్పుడే. అది నిజమేనా?" అన్నాను నెమ్మదిగా.

"అవునండీ. నిజమే. విన్నరాత్రే వచ్చేను అక్కడ నుండి."

"కారణం?"

"ఏం చెప్పమంటారు? మా కర్మ అంతే. అంతకన్నా మేమేం చెప్పగలమండీ."

ఇంతలో సావిత్రమ్మగారు కాఫీ తీసుకు వచ్చి టీపాయ్ మీద పెట్టేరు — మాట్లాడలేక నోటిలో కొంగు పెట్టుకుని గోడవారగా నిలుచుండి పోయేరు

"బాధ పడకండమ్మా! ఏంచేస్తాం, ఈ సంగతి నేను చూస్తాను. ఇంతవరకూ వచ్చేక వాళ్లు యిల్లా అనడానికి వీల్లేదు. నేను వెళ్ళి మాట్లాడతాను కదా! మీరేమీ బెంగపడకండి. ధైర్యంగా ఉండండి. రమాదేవి బాధ పడుతుంది, జాగ్రత్తగా చూసుకోండి."

"అది కాదండీ శాస్త్రిగారూ! వారెంత మొండిగా వాదించేరనుకున్నారు! ఎంత చెప్పినా వినిపించుకున్నారు కాదు." అన్నారు గోపాలరావుగారు.

"మరేమీ ఫర్వాలేదు. అన్నీ నేను చూసుకుంటాను. మీరు దిగులుపడకండి" అని వారికి ధైర్యం చెప్పి రావుగారిని నాతో మా యింటికి తీసుకు వచ్చేను.

"రావుగారూ! అసలు విషయమేమిటి? ఏం జరిగింది? వివరాలన్నీ దయచేసి చెప్పండి" అని అడిగేను మా యింటి దగ్గర. చాలా బలవంతంమీద యీ క్రింది విషయాలు చెప్పేరాయన.

"జగన్నాధరావుగారని విజయవాడలో ఎగ్జిక్యూటివ్ యింజనీరుగా పనిచేస్తున్నారు. ఆయనే వరుని తండ్రి. వరుడు కూడా ఎమ్.టెక్. ప్యాసయి హైదరాబాదులో ఉద్యోగం చేస్తున్నాడు. వారి


ఇప్పుడు మూడు మంటలమీద
వంట చేసుకోండి, గ్రిల్ కూడా
చేయండి. అన్నీ ఒకే సారి.
HOTLINE
Sizzler



ఇటీవల జరిగిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంక్ (హైదరాబాద్) రిక్రియేషన్ క్లబ్ వార్షికోత్సవము సందర్భంగా వేదికపై శ్రీ పి రఘునాధరావు (క్లబ్ అధ్యక్షులు), శ్రీ యు. బి రాఘవేంద్రరావు, ఐ ఎ. ఎస్. (బ్యాంక్ మేనేజింగ్ డైరక్టర్), శ్రీమతి యు. బి. భారతి (ముఖ్య అతిధి), శ్రీ హీరాలాల్ (క్లబ్ కార్యదర్శి) లని చిత్రంలో చూడవచ్చు

వారి కుటుంబానికి చాలా కష్టం కలుగుతుంది నిజమే కాని నన్ను మాత్రం ఏం చెయ్యమన్నారు? ఇంతవరకూవచ్చేక యీ వివాహం జరిపించడానికి నాకు మనస్సు ఎల్లా ఒప్పుతుంది చెప్పండి? ఈ విషయం ఎవ్వరికీ చెప్పలేదు నా భార్యకుకాని, మా అబ్బాయికి కాని ఈ విషయాలు తెలియవు. ఏదో జాతకాలు కుదరవన్నారని చెప్పేను. మా వాడు బాధపడ్డాడు. ఇది ముందే యెందుకు చూసుకోలేదని నా మీద నేరారోపణ చేసేడు సరే ఏమైతేనేమి అవన్నీ నేనే భరించి ఈ సంబంధం నిరాకరించవలసి వచ్చింది విషయాలు మీరు అడిగేరు కమక పూర్తిగా మీకు చెప్పవలసి వచ్చింది అదిన్నీగాక ఎవరితోనో చెప్పకుంటే కాని యీ బాధ నేను మనస్సులో భరించలేకపోతున్నాను. ఈ పరిస్థితులలో నన్ను ఏమి చేయమన్నారో, నేను చేసిన పని యెంతవరకూ సమంజసమో మీరు బాగా ఆలోచించండి. నేను చేసినది పొరపాటైతే క్షమార్పణ కోరుకుంటున్నాను అంతకన్నా ఏమి చేయడానికి తోచలేదు ''

ఈ విషయాలన్నీ విని నేను నిర్విణ్ణుడ్నైపోయేను. ఇంక నేనేమీ ఆయనకు సమాధానం చెప్పలేకపోయేను. కాని యింతవరకూ వచ్చేక ఈ విషయమేదో పూర్తిగా తెలుసుకోవాలని అనిపించింది నాకు అక్కడనుండి బయల్దేరి రాఘవరావు ఉన్న ఊరు వెళ్ళాను అతడిని యింటివద్ద కలుసుకున్నాను. అతడు అవివాహితుడని నాకు తెలుసును. కాని ఒక పాతిక సంవత్సరాల వయస్సుకల యువతి కూడా అతడితో యింటిలో ఉన్నది. అప్పుడు నా కనిపించింది పొరపాటువల్ల రమాదేవి పేరు యిందులో యిరుక్కుందేమోనని.

## ''రా య బా ర ం''

''చూడండి రాఘవరావుగారూ ! మీ బావగారి ఊరునుండే వచ్చేను నేను మీ మేనకోడలు రమాదేవి వివాహం నిశ్చయమైనట్లు మీరు తెలుసునను కుంటాను ?''

''అవునండి శుభలేఖ వచ్చింది చూసేను ''

''ఇప్పుడా వివాహం ఆగిపోయింది ''

''అల్లాగునా ! ఎందువలన ?''

''మీ వల్లనే.''

''అంటే !''

జరిగిన విషయం పూర్తి వివరాలతో అతడికి చెప్పేను.



''బాగుంది. అయితే నా ఉత్తరం పనిచేసిందన్న మాట'' అన్నాడు సంతోషంగా.

నేను అవాక్కయిపోయేను.

''చూడండి. మీరెవరో నాకు తెలియదు. అయినప్పటికీ మీరు పెద్దవారు కమక గౌరవమిచ్చి మాట్లాడుతున్నాను, ఈ వివాహం చెడగొట్టడానికి నేనే ఆ ఉత్తరం వ్రాసేను. ఎందువల్లనని మీరు అడుగుతారు. చూడండి — రమాదేవి నాకు అక్క కూతురు, నాకు చిన్నతనం నుండీ కూడా రమను పెండ్లి చేసుకోవాలని ఉండేది. నేను మా బావగారినీ అక్కయ్యనూ రెండు సంవత్సరాల క్రితం వరకూ యెంతగా ప్రాధేయపడి అడిగేనో రమను నాకిచ్చి వివాహం జరిపించమని. వారందుకు ఒప్పుకోలేదు. నన్ను నానా చీవాట్లూ పెట్టేరు. నాకులేని దుర్గుణం లేదన్నారు. నిజమే. రమ నిచ్చి పెండ్లి చేస్తే అన్నింటినీ వదలి రమను పువ్వుల్లో పెట్టి చూసుకుంటానన్నాను. వినలేదు. నన్ను చాలా చులకనగా చూసేరు. నా కన్నా పెద్ద సంబంధం చేయగలరా వాళ్ళు ? చూడండి నేనూ మంచి ఉద్యోగంలోనే ఉన్నాను. అందరికన్నా ఎక్కువగానే సంపాదిస్తున్నాను నేనూ అందమైన యువకుల్లోనే లెక్క. నన్ను కాదని రమను యింకొకరికిస్తే నేనెల్లా సహించగలను చెప్పండి ? అప్పటి నుండి అనగా వారు నన్ను కాదన్నప్పటి నుండి యీ పథకం వేసేను ఈ అమ్మాయి ఎప్పుడూ నాకూడానే ఉండేది. మేము మకాంచేసిన బంగాళాల్లోనూ హోటళ్ళలోనూ కూడా రమాదేవి పేరే రిజిష్టర్లలో వ్రాసేవాడిని ఆ విధంగా రికార్డు పుట్టించేక యింక నాకు యేమీ అధైర్యం లేకపోయింది ఇప్పుడింక రమకు ఎల్లా పెళ్ళి చేస్తారో చూడాలని నిశ్చయించుకున్నాను. శుభలేఖ రాగానే వివరాలతో ఉత్తరం వ్రాసేను అంతే మిగిలిన విషయాలు మీకు తెలుసును ఇదంతా నాకు రమాదేవి మీదుండే ప్రేమవల్లనే కాని మరేమీకాదు ఇంక ఏ వరుడూ రమను వివాహం చేసుకోడు నాకు తెలుసును కాబట్టి మీరు పెద్దవారు అనుభవజ్ఞులు అందువలన మిమ్మల్ని నేను ప్రార్థించేదేమిటంటే మీరు వెళ్ళి మా బావగారితోనూ, అక్కయ్యతోనూ చెప్పి రమను నాకిచ్చి పెండ్లి చేయమనండి నేను తప్ప యింకెవరూ ఆమెను వివాహం చేసుకోడని మీకూ తెలుసును. మీరివన్నీ చెప్పేక వాళ్ళూ తెలుసుకుంటారు. అందువల్ల యింక రమకు పెండ్లి యింకొకనితో కానివ్వను నేనే వివాహం చేసుకుంటాను మీరీ బాధ్యత వహించి మా బావనూ అక్కయ్యనూ ఒప్పించండి. ''

ఇంతటి దుర్మార్గుడైన రాఘవరావు యెదుట ఉండలేకపోయేను. వెంటనే లేచి కోపంతో వాకో తోచినట్లు అతడిని దూషించి బయటకు వచ్చేసేను లోపలనుండి వాళ్ళిద్దరూ పకపక నవ్వడం వినపడింది

ఇంటికి వెళ్ళి విషయాలన్నీ గోపాలరావుగారికీ, సావిత్రిగారికీ చెప్పేను. వారు హతాశులై కృంగి పోయేరు.

''శాస్త్రిగారూ, మీరు తీసుకున్న శ్రమకు చాలా కృతజ్ఞులం. కాని వాడికి రమను యిచ్చేబదులు ముగ్గురం కట్టకట్టుకుని ఏ గోదావరిలోనో దిగడం మంచిదండి'' అన్నారు గోపాలరావుగారు ★

# దావణగెరె

**అందంచిందె సమ్మేళనతో నూతన సరళి కల్పన !**

మనసును దోచే
మృదువైన నేతలలో* ప్రియ
టెరీన్* చీరలు.
చకితుల్ని చేసే పువ్వుల
తీగల తీరు తెన్నుల్లో!
కనులకు యింపైన రంగుల్లో!
ప్రతి ఒక్కరి అభిరుచికి
అనుగుణంగా.



దావణగెరె
ఫ్యాషన్ వస్త్రములు

ది దావణగెరె కాటన్ మిల్స్ లిమిటెడ్
హనుమంతప్ప బిల్డింగ్స్,
చిత్రదుర్గ రోడ్, దావణగెరె 577 002.

షోరూములు :
కావేరి భవన్, బెంగుళూరు-560 009.
దాజీబాన్ పేట్, హుబ్లి-580 020.
చిత్రదుర్గ రోడ్, దావణగెరె-577 002.

*[illegible]

# కొత్తగొంతులు

**టి.యల్. కాంతారావు**

ఆవేశాన్ని అనౌచిత్యం పాలు
కానీయని ఆలోచన
అవ్యావహారితను నిరాకరించిన
వివేచన
అంతర్బహిరంగ సమన్వయాల
సమాలోచన భావం

దాని అభివ్యక్తిలోని వైవిధ్యం,
సాధనాల సమ్యక్సమ్మేళనం
ఔచిత్య భావనా సంధానం -
ఆనంద భావన, అనుభూతి
ప్రసారణ
అనంత జగచ్చైతన్యావగాహన —
నా కవితకు ప్రేరణాలు;
స్పందనలో దోహదాలు.

**- కోవెల సంపత్కుమారాచార్య**

సంపత్కుమారగారు చేతనావర్త కవులలో ఒకరు. తెలుగు, హిందీ భాషలలో ఎం. ఏ పట్టభద్రులు. ఆధునిక తెలుగు సాహిత్య విమర్శ; సంప్రదాయకరీతి అను అంశపై పరిశోధన చేసి పి. హెచ్. డి. తీసుకొన్నారు. తెలుగులో ఛందో వికాసం అనే విస్తృత శాస్త్ర గ్రంథాన్ని రాశారు. ఈయన పరిష్కరించి విపుల పీఠికలు రాసిన లక్షణ సారసంగ్రహము, సుకవి మనోరంజనము అను లక్షణ గ్రంథాలను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో తెలుగుశాఖలో పనిచేస్తున్నారు. ఆదిలో సంప్రదాయక ఛందస్సులలో పద్యాలు రాసినా 1965 తరువాత వచన కవితా మార్గాన్నే అనుసరించారు. వచన గేయం పద్యమా ? గద్యమా ? అనే విషయంపై సంపత్కుమారగారు, చేకూరి రామారావుగారు భారతిలో సుదీర్ఘ చర్చలు చేయటం ఆ చర్చలు ఒక పుస్తకంగా రావటం సాహిత్య పరిశీలకులకు తెలియని విషయం కాదు.

కవిత్వం పైనా, సమాజం పైనా చేతనావర్త కవుల దృక్పథమే సంపత్కుమారగారి దృక్పథం కూడా. అయితే అందరిలోనూ సంపత్కుమారగారి శాస్త్రబలం గొప్పది.

రాజకీయ శాస్త్రం, సామాజిక శాస్త్రం భిన్నమైనట్లుగానే రాజకీయ సిద్ధాంతం, సామాజిక సిద్ధాంతం వేరు వేరుగా భావిస్తున్నారు సంపత్కుమారగారు. రాజకీయనుండి సమాజాన్ని, సమాజంనుండి రాజకీయాన్ని విడదీయటం అసాధ్యం; అట్లాగే సిద్ధాంతాలు కూడా. ఏ సిద్ధాంతానికైనా సమాజమే పునాది అని వీరు విశ్వసించటంలో పొరపాటు పడలేదు కాని ఆ సిద్ధాంతం దేశ కాల పరిస్థితులమీద, జాతీయ జీవన విధానంమీద ఆధారపడి ఉండాలని వీరి ఉద్దేశం. అట్లా దేశాన్ని, దేశ పరిస్థితుల్ని విస్మరించిన సిద్ధాంతాలు అస్థాన పతిత మవుతాయని గట్టిగా చెబుతున్నారు సంపత్కుమారగారు. పూర్వ కవిత్వ విమర్శలో కవితా సిద్ధాంతాలే ప్రధానం. నేటి కవితా విమర్శలో భావ సిద్ధాంతాలు ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. రెంటికీ కవిత్వ శిల్పం ముఖ్యమే. చేతనావర్త కవులలో సుప్రసన్నగారికిగాని, సంపత్కుమారగారికిగాని మొదటి సంకలనంలో కంటె రెండవ సంకలనంలోనే సమాజాన్నీ, మనిషినీ గురించిన ఆలోచన ఎక్కువైనట్లు గమనిస్తాం. 'నన్ను నే బాగా పరీక్షించుకొని — నేను కాని దాన్ని దులుపుకొని — నన్ను నాలో లయం కానీండి' అన్నవారు రెండవ సంకలనంలో సమాజంలో కూడా లయం కావాలనే సంకల్పానికి వచ్చారు.

సమాజం సంస్కరింపబడటానికి, మనుషులందరూ సుఖ జీవనం చెయ్యటానికి అనేక పథాలూ, దృక్పథాలూ ఆవిష్కరింపబడుతున్న వర్తమాన అవ్యవస్థిత సమాజంలో వ్యక్తివికాసమే సామాజిక వికాసంగా పరిణమిస్తుందని నమ్మే కవులు కొంతమంది ఉన్నారు. వారిలో సంపత్కుమారగారు కూడా ఒకరు. ప్రతి వ్యక్తి తనను తాను ఉద్ధరించుకొనే స్థితిలో ఉంటె అసలు సమాజం అవ్యవస్థితం అయ్యే అవకాశమే లేదు. కనుక అల్పసంఖ్యాకులు అధిక సంఖ్యాకుల్ని చైతన్యవంతుల్ని చెయ్యవలసిన అవసరం ఎప్పుడూ ఉంటుంది. వర్తమానం యొక్క భయంకర స్థితిని సంపత్కుమారగారు పూర్తిగా ఆమోదించారు. దీని సత్వర మార్పును కూడా ఆయన ఆశిస్తున్నారు. పద్ధతిలోనే భేదం. మహావృక్షం కింద పిలక ఎదగదు. వృక్షం కూలేదాకా పిలక తన జీవన పోరాటాన్ని ఆపుకుంటుందా? ఎప్పుడో ఈ సమాజం విధ్వంసం అవుతుంది; అప్పుడు అందరం సుఖపడవచ్చు అని వర్తమానంలో నిష్క్రియాత్వంలోకి జారిపోవటం ఉచితమైన



విషయం కాదు. భవిష్యత్తు వర్తమానమే తుందిగాని వర్తమానం భవిష్యత్తెన్నడూ కాదనే భావనతో భవిష్యదుజ్వల జీవితానికి సోపానాలు ఎవడు నిర్మించుకోడు ? సమాజం ఎక్కడా స్పందించలేదు అనే ఖండికలో ఈ వ్యవస్థ స్వరూపాన్ని సమగ్రంగా ప్రదర్శించారు సంపత్కుమారగారు. భవిష్యత్తుమీద ఆశతోనే అట్లాంటి వ్యవస్థను నిర్మూలించే వర్తమాన కాల ప్రయత్నం. సిద్ధాంతం దేశీయమైనా, విదేశీయమైనా యావత్సమాజానికి సుఖప్రదమైనపుడు ఆమోదయోగ్యమే కదా !

సంపత్కుమారగారి వచన కవిత్వం అధిక భాగం వ్యంజకత్వాన్ని ఆశ్రయించింది. అది వీరి కవిత్వాన్ని సాధారణ స్థాయి కంటె ఒక మెట్టు పైకి తీసుకువెళ్ళిన గుణం. చేతనావర్తం మొదటి సంకలనంలో రోజువారా అనే ఖండిక ఈ వ్యంజకతకు పరాకాష్ఠ. ఈ దేశానికి, దాన్ని నిలువునా దోపిడీ చేస్తున్న మనుషులకు, దోపిడీ కాబడుతున్న వాళ్ళకు ఈ గేయం మొత్తం ప్రతీక. చాలా వచన గేయ ఖండికలన్నీ వాచ్యార్థాల కంటె అంతరార్థాలనే ఇస్తాయి. వచన కవిత్వ ప్రక్రియపై కొంత లక్షణ చర్చ చేసిన వారవటం వల్లనేమో పాదాల విరుపు తూగు విషయంలోనూ, అంత్యప్రాసల విషయంలోనూ శ్రద్ధ ఎక్కువగా తీసుకొన్నారు. కవితా శైలి మాత్రం వచన గేయానికి చాలా స్థానాల్లో పొదగదు. 'తృష్ణా వికృష్యమాణ భావాల్లో — రుష్యన్మనుష్య భ్రమ క్రూరూపాల్లో' వంటి పాదాలు వచన కవిత్వానికి సరిపడనివి. సంపత్కుమారగారి భావనలో వచన కవిత ఛందో రూపం. నా వరకు మాత్రం వచన కవిత ఛందస్సు అనే తొడుగును ఏనాడో విసర్జించిన స్వచ్ఛ కవితా రూపం. ఛందశ్శాస్త్రంమీద విపరీతంగా పరిశ్రమ చేసిన సంపత్కుమారగారు భావానికీ ఛందో రూపానికీ అవినాభావ సంబంధం ఏమీ లేదనటం ఆశ్చర్యకరమైన విషయం. అట్లాంటి సంబంధమే లేకపోతే కవిత్వంలో ఇన్ని రూపాలు అవతరించవు.

సంఘంలో మార్పురావాలని, మనిషి మనిషిగా బ్రతికే వ్యవస్థ కావాలనీ, వ్యక్తి భావ స్వాతంత్ర్యం నశించే సిద్ధాంతం ఆమోద యోగ్యం కాదని నమ్ముతూ, మార్క్సీయ దృక్పథంమీద అవిశ్వాసంతో, భారతీయమైన విధానంమీద విశ్వాసంతో అటు సంప్రదాయానికి, ఇటు ఆధునికతకు మధ్య నిలబడి కవిత్వం రాస్తున్న కవి సంపత్కుమారగారు.

నిర్దుష్టంగా నిర్దిష్టంగా
ఏర్పడ్డ నీ లక్ష్యంవైపు
నేరుగా నిటారుగా నిర్ద్వంద్వంగా
ముందుకు నడువు
కాలం ఎప్పుడూ ఎక్కడా పెట్టలేదు
గడువు
సాధ్యం ఎప్పుడూ అసాధ్యం కాదు
గమ్యం ఎప్పుడూ అగమ్యంకాదు. ★

# సంపూర్ణ పోషకాహారంలో అన్ని పోషక పదార్థాలు సరియైన పాళ్ళలో వుండాలి...



# సిరిలాక్ సంపూర్ణ పోషకాహారాన్ని సిద్ధం చేస్తుంది— రుచికరమైన విధంగా.

మీ పాపకి నాలుగు నెలలు నిండి ఘన పదార్థాలు తీసుకోడానికి సిద్ధంగా వున్నప్పుడు, సిరిలాక్ గురించి మీ డాక్టర్‌ని సంప్రదించండి. మీ పాపకి సిరిలాక్ ఆహారంగా యిచ్చిన ప్రతి పర్యాయము సంపూర్ణ పోషకాహారం యిచ్చామనే నమ్మకం మీకు మరొకసారి కలుగుతుంది.

అనగా సిరిలాక్ యిచ్చిన ప్రతి పర్యాయము ఒక ఘన ఆహార పదార్థం నుంచి అవసరమైన అన్ని పోషకాలు. మాంసకృత్తులు, కాలరీలు, పాపకి లభిస్తున్నట్లే. అది యిస్తూ పోషక పదార్థాల లోపం తొలగించడానికి మరొకటి ఇవ్వవలసిన అవసరం లేదు.

గోధుమ పిండి, పూర్తి మీగడ పాలు, పంచదార రుచికరంగా కలిపి వుండడం చేత సిరిలాక్‌కి ఈ సంపూర్ణ పోషకత్వం, రుచి లభించాయి. శరీర నిర్మాణానికి మాంసకృత్తులు, శక్తికి పిండి పదార్థాలు, క్రొవ్వు పదార్థాలు, అన్ని విధాల పెరుగుదలకి అత్యంత అవసరమైన విటమిన్లు, ఖనిజాలు సిరిలాక్ అందచేస్తుంది.

మీ పాపకి సిరిలాక్ యివ్వండి—పాప బాగుగా, ఆరోగ్యంగా పెరగడానికి.




# సిరిలాక్®

పాలు వుండనే వున్నాయి



సిరిలాక్ తయారు చెయడం ఎంతో సులభం. దీనిని ముందుగా మరగబెట్టిన, గోరువెచ్చటి నీటికి చేర్చండి, కలపండి వడ్డించండి.

SAA/FSL/C/2670 TEL

NESTLÉ



**అందులోంచి దిగి ఫేర్ చెల్లించి సూట్‌కేస్ చేత్తో పట్టుకుని గేటుదగ్గరగా వచ్చి నిలబడి ఆ భవనాన్ని పరిశీలనగా చూశాడు సురేంద్ర.**

చిన్నదైనా అందమైన ఎలివేషన్‌లో ఆకర్షణీయంగావున్న ఆ భవనం కాంపౌండువాల్‌కి కాస్త లోపలిగా వుంది .... ముందుభాగంలో రెండు వైపులా రకరకాల మొక్కలలో, రంగు రంగుల పువ్వులతో కళకళ్ళాడుతూ ఆహ్లాదకరంగా కనిపిస్తోంది.

పచ్చగడ్డి తివాచీ పరిచినట్టు వుంది ఎర్రగులాబీలూ, మందారాలూ కుంకుమ చల్లినట్టుగా విరబూశాయి.

మేడ పైభాగంలో వరండా అంచులమీదనుంచి పూలకుండీలు క్రిందికి వ్రేలాడుతున్నాయి. వాటిలోంచి క్రీపర్స్ క్రిందికి పాకుతున్నాయి కొద్దిగా; దేనినో అల్లుకుపోవటానికి ప్రయత్నిస్తూ!

మరోసారి ఆ బోర్డు చూసి తనకుకావలసిన ఇల్లు ఇదేనని నిశ్చయించుకుని లోపలికి అడుగు పెట్టాడు సురేంద్ర. రెండడుగులువేసి మెల్లగా గేటు లోపలికి త్రోశాడు.

ఆ శబ్దానికి పూలమొక్కలదగ్గర నిలబడి క్రోటన్సును అందంగా కట్‌చేస్తున్న యువతి తలెత్తి చూసింది అతన్ని.

కండలుతిరిగిన శరీరంతో, అందమైన ముఖ వర్చస్సుతో ఎర్రటి శరీరచ్ఛాయతో, ఆకర్షణీయంగా వున్నాడతను. గాంభీర్యం తొంగిచూసేలాంటి చూపులు, అలల్లా ఒంపులు తిరిగిన జుట్టు, ఎత్తుగా హుందాగావున్న అతన్ని విస్మయంగా 'ఎవరా' అని చూస్తూ ఎదురొచ్చి 'మీరూ' అంటూ ఆగిపోయింది. తననట్లా కళ్ళప్పగించి చూస్తున్న ఆమెనుచూసి నవ్వాడు

''నేను... నేనే'' అంటూ సరదాగా ఎగతాళి చేశాడు.

చెవులకింద పెద్ద రింగులు,జడ వేసుకోకుండా వదిలిన కాస్త జుట్టూ భుజాలమీద పడుతూ, నుదుట చిన్న బొట్టుతో తెల్లగా అందంగా వుంది మంజుల.

అతని మాటలకి కళ్ళు ఇంతచేసి చూపుల్లో కోపాన్ని మిళితం చేసి అతన్ని చూసింది.

''మీరు మీరుకాక నేనెట్లా అవుతారు! ఒకవేళ కావాలనుకున్నా కాలేరు. అయినా మిమ్మల్ని చూస్తుంటే జాలేస్తుంది. ఏ పిచ్చాసుపత్రో అనుకుని ఇక్కడికి వచ్చినట్టున్నారు. ఇది లాయర్ విశ్వనాధంగారి ఇల్లు'' అంటూ వ్యంగ్యంగా జవాబిచ్చింది.

ఆమె వాగ్ధాటికి ఆశ్చర్యపోయి చూస్తూ,



కొత్త సీరియల్ ప్రారంభం!

వక్కలంక పద్మావతి

నిలబడిపోయాడతను. ఇంతలో గేటుముందు కారాగిన శబ్దం వినిపించి... ఇద్దరూ అటు చూశారు.

విశ్వనాథంగారు కారు దిగి... కర్చీఫ్‌తో ముఖం తుడుచుకుంటూ... లోపలికి వస్తూ చూశారు వాళ్ళిద్దర్నీ.

సురేంద్రని చూస్తూనే ఆశ్చర్యపోయారు. "అరే, ఎట్లా వచ్చావు బాబూ, నీకోసం నేను స్టేషన్‌కి వెళ్ళొస్తున్నాను. మీ నాన్న పంపిన టెలిగ్రామ్ ఇంతకుముందే అందింది. వెంటనే కారు తీసుకుని స్టేషన్‌కి వచ్చేశాను. ఎంత వెతికినా కనిపించక, బహుశా ఈరోజు బయల్దేరుండవని తిరిగొస్తున్నాను" అన్నారు.

"నేను మీకోసం చూశానంకుల్. పనుల వత్తిడిలో రాలేకపోయుంటారని, అడ్రసు వెతుక్కుంటూ నేనే వచ్చాను. ఈమె ఎవరో కానీ నన్ను ఎండలో నిలబెట్టేసి... నాకు పిచ్చి పట్టింది అంటున్నారు" అన్నాడు మంజులకేసి చూస్తూ.

"అయ్యో, ఎవరో అంటావేమిటి, మా అమ్మాయి మంజుల. ఎమ్మే చేస్తోంది" అంటూ గట్టిగా నవ్వేశారాయన.

"అయామ్ సారీ, ఈ మాట ముందే చెప్తే... ఈపాటికి కూల్ డ్రింక్ తాగుతుండేవారు కదా!" అంటూ నవ్వుతూ, "ఒరే, రామూ! ఈ సూట్‌కేస్ లోపలికి తీసుకెళ్ళు" అంటూ పనికుర్రాణ్ణి పిలిచి హాల్లోకి దారితీసింది మంజుల.

సురేంద్ర విశ్వనాథంగారితోపాటుగా లోపలికి నడిచాడు.

సురేంద్ర తండ్రి రఘుపతిరావుగారూ, విశ్వనాథంగారూ చిన్ననాటి స్నేహితులు. విశ్వనాథం వృత్తిరీత్యా విజయవాడ వదిలి, తిరుపతి వచ్చేశారు మంజుల చిన్నతనంలోనే! రఘుపతిరావుగారికి విజయవాడ పరిసర గ్రామాల్లో భూములు, ఆస్తులు వున్నాయి. వ్యాపారం అవీ చూసుకుంటూ ఆయన అక్కడే ఉండిపోయారు.

విశ్వనాథంగారు కోర్టు పనిమీద విజయవాడ వచ్చినప్పుడు రఘుపతిరావు గారింట్లోనే వుండి వెళ్ళేవారు. సురేంద్ర వైజాగ్‌లో ఇంజనీరింగ్ చదువుతూండటం వల్ల సెలవల్లో వచ్చినప్పుడు మాత్రమే విశ్వనాథంగారికి కనిపించేవాడు. అతని నెంతో ఆప్యాయంగా పలకరించేవారాయన. విశ్వనాథం గారు లాయరనీ, తండ్రి ప్రాణ స్నేహితుడనీ మాత్రమే తెలుసు సురేంద్రకు. అంతకు మించి ఆయన కుటుంబ వివరాలు ఏమీ తెలీవు.

చదువు పూర్తవగానే సురేంద్రకు జూనియర్ ఇంజనీరుగా తిరుపతిలో ఉద్యోగం వచ్చింది పిడబ్ల్యుడిలో!

ఈ విషయం ఉత్తరం ద్వారా తెలుసుకున్న విశ్వనాథంగారు చాలా సంతోషించారు. అతను తిరుపతిలో ఉద్యోగం చేసినన్నాళ్ళూ తన యింట్లోనే వుండాలని, అది తన స్వంత యిల్లుగా భావించమనీ అలా కాకుండా మరెక్కడైనా వుండటం తాను సహించనని సీరియస్‌గా జవాబిచ్చారాయన.

దాంతో సురేంద్రకు తండ్రి ఆజ్ఞ పాటించక తప్పలేదు.

కొత్త వూరు, కొత్త మనుషులు... 'ఎలాగ' అనుకుంటూ బిడియంగా రైలు దిగిన సురేంద్ర స్టేషన్‌కి వస్తామన్న విశ్వనాథంగారు కనిపించక పోయేసరికి అడ్రసు ప్రకారం ఆ యిల్లు చేరాడు.

కానీ వచ్చింతర్వాత చలాకీగా, చనువుగా మాట్లాడే మంజులను, ఆప్యాయంగా చూసే విశ్వనాథంగార్ని చూడగానే కాస్త రిలాక్స్ అనిపించింది మనసుకి.

ఇవన్నీ ఆలోచిస్తూ బొమ్మలా కూర్చుండిపోయిన సురేంద్రను చూసి అతని మొహంమీదుగా గట్టిగా చిటికెలు వేసింది మంజుల.

ఉలిక్కిపడి ఆలోచనల్నుంచి తేరుకుని ఆమెను చూశాడు.

మంజుల పకపకా నవ్వింది. "ఏమిటండీ బాబూ! కూర్చునే ప్లానులు వేసేస్తున్నారు. మీ ఇంజనీర్లతో వచ్చిన చిక్కే ఇది. మా యిల్లు డిజైన్ నచ్చకపోతే చెప్పండి! మా నాన్నగారితోచెప్పి రీమోడల్ చేయించేద్దాం!" అంటూ ఫ్రిజ్‌లోంచి తెచ్చిన గోల్డ్‌స్పాట్ అతనికి అందించింది.

"అహ! అదేం లేదండీ" అంటూ ఆమె మాటలకు నవ్వుతూ డ్రింక్ సిప్ చేయసాగాడు మెల్లగా! విశ్వనాథంగారు కూడా గట్టిగా నవ్వేశారు

లోపల గదిలోంచి పైటతో చేతులు తుడుచుకుంటూ మంజుల తల్లి పార్వతిగారు చిరునవ్వుతో వచ్చారు హాల్లోకి.

"మన రఘుపతి లేడోయ్! వాళ్ళబ్బాయి.. ఇతనే. గుర్తుపట్టగలవా! ఎప్పుడో చిన్న పిల్లాడిగా ఉన్నప్పుడు చూశావు. ఇప్పుడు చూడు ఎంత

పెద్దవాడైపోయాడో!" అన్నారు భార్యవంక చూస్తూ !

"మా మమ్మీ!" అంటూ పరిచయం చేసింది తల్లిని మంజుల.

"నమస్తే ఆంటీ!" రెండు చేతులూ జోడించాడు అతను.

చిన్నప్పటి సురేంద్రకి, ఇప్పటికీ రూపంలో — వచ్చిన మార్పుని గమనిస్తూ, ఎన్నో కబుర్లు చెప్పారావిడ. వాళ్ళు విజయవాడలో ఉన్నప్పుడు సురేంద్ర తల్లీ తనూ ఎంత స్నేహంగా ఉండేదీ ... అతనికి ఏడేళ్ల వయసులో తల్లి గుండెనొప్పితో చనిపోతే అతనెంత బెంగపెట్టుకున్నదీ ... అన్ని విషయాలూ ఆవిడ చెపుతూంటే మౌనంగా గతాన్ని తల్చుకుంటూ, వింటూండిపోయాడు సురేంద్ర.

"అమ్మాయ్ మంజూ! సురేంద్రకు పైన గదులు చూపించమ్మా!" అంటూ సురేంద్రవైపు తిరిగి, "అక్కడ నీకు చాలా హాయిగా ఉంటుంది! ఏం కావాలన్నా మొహమాట పడకుండా అడుగు. ఈ యిల్లంతా నీ స్వంతమనుకో!" ఆప్యాయంగా అన్నారు విశ్వనాథంగారు.

'రండి' అంటూ వరండాలోంచి వున్న మెట్ల మీదికి దారితీసింది మంజుల. ఆమె ననుసరించాడు సురేంద్ర.

దగ్గరగా వేసున్న తలుపులు తోసుకుని లోపలికి నడుస్తూ అంది మంజుల "రండి! ఇదే మా హాలు. ఈ పక్కది బెడ్‌రూమ్. అవతల కిచెన్ ... మీకు దాంతో అవసరం లేదనుకోండి. అది ఎటాచ్డ్ బాత్ ..." అంటూ అన్నీ చూపించింది.

"ఈ యిల్లు నాకు అద్దెకిస్తున్నారా ఏమిటి! అన్ని గదులు జాగ్రత్తగా చూపిస్తున్నారు" అంటూ నవ్వాడు.

"ఇంకా నయం! అద్దెకిస్తే శిథిలం చేస్తారు. అదేం కుదరదు. ఫ్రీగానే ఇస్తే జాగ్రత్తగా వుంచుతారు" అంది తనూ అతని నవ్వుతో శృతి కలుపుతూ !

మొదట విశాలమైన గది. నేలంతా పరచిన కార్పెట్. కార్నర్స్‌లో అమర్చిన పూలకుండీలు ... గోడలకు ఒకటి రెండు అందమైన ఆయిల్ పెయింటింగ్స్ ... కిటికీలకు తలుపులకు గోడ రంగులో కలిసే మాచింగ్ కర్టెన్స్ ... ఒక పక్క గోడకు అమర్చిన బుక్ షెల్ఫ్, దాని పక్కగా బెడ్‌రూమ్, ఇల్లంతా అందమైన ఫర్నీచర్‌తో అలంకరించబడింది.

"చాలా బావుంది యిల్లు. మీకు చాలా శ్రమ ఇచ్చినట్లున్నాను. కదూ!" అన్నాడు.

"అబ్బే,అలాంటిదేమీలేదు. మీరంటే నాన్నగారికి చాలా అభిమానం. ఎప్పుడూ మీ గురించే చెప్తుంటారు. ఇప్పటికే చాలా టైమైంది. రాముతో వేడినీళ్ళు పంపిస్తాను. స్నానంచేసి, టిఫిన్ తిని రెస్ట్ తీసుకోండి. వంటకాగానే మీల్స్ ఎరేంజ్ చేసి మిమ్మల్ని పిలుస్తాను. ఓకే ..." అంటూ వెనుదిరగబోయింది మంజుల.

"మంజులా!" అన్న అతని కొత్త పిలుపుకు భృకుటి ముడిచి... ఏమిటన్నట్టు చూసింది ఒక్క క్షణమాగి.

## ఇది మేఘ సందేశమూ...

"మంజులా! మా కుటుంబంతో వున్న స్నేహాన్నిబట్టి మీరు ఇంతగా నన్ను ఆదరిస్తున్నారంటే... మీకెలా కృతజ్ఞతలు తెలుపుకోవాలో అర్థం కావటంలేదు" అన్నాడు ఆర్ద్రంగా.

అతని మాటలకి సన్నగా నవ్వి, "అంతేకదా! వీలు చూసుకుని... ఆలోచించి చెప్తాను మీ ప్రశ్నకు సమాధానం. నే వస్తానుమరి" అంటూ వేగంగా వెళ్ళిపోయింది కిందికి.

ఆమె వెళ్ళినవైపే చూస్తుండిపోయాడతను.

*  *  *

సురేంద్ర డ్యూటీలో జాయిన్ అయాడు. అతన్ని ప్రస్తుతానికి ఆఫీసు వర్క్స్‌లోనే వేశారు. మంజులకి సెలవైనప్పుడల్లా అతన్ని ఆఫీసు దగ్గర కార్లో డ్రాప్ చేసేది.

ఆ యింట్లో అందరి అభిమానం... మంజుల సహవాసంతో ఆ యింట్లో ఒకటిగా అయిపోయాడు అతను. ఖాళీగా ఉన్నప్పుడంతా విశ్వనాథంగారు అతన్ని చెస్ ఆడటానికి పిల్చేవారు. అలా వాళ్ళిద్దరూ ఆటలో కూర్చుంటే గంటలు గడిచిపోయేది.

విశ్వనాథంగారికి దైవభక్తి, ఆస్తికత్వం అధికం. ప్రతి రాత్రి భగవద్గీత చదవనిదే నిద్రపోరాయన. భగవంతుడు, శాస్త్రీయ సంగీతం, పురాణ విశిష్టత మొదలైన విషయాల గురించి ఎంతసేపయినా విసుగూ విరామం లేకుండా మాట్లాడేవారు. ఎక్కడ స్వాములవార్లు వచ్చినా, పూజ పునస్కారాలు జరుగుతున్నా తప్పకుండా వెళ్ళేవారు.

నెల రోజులు గడిచిపోయాయి.

ఆ రోజు సురేంద్ర ఆఫీసునుంచి వచ్చేసరికి సాయంత్రం అయిదున్నరయింది. విశ్వనాథంగారు, పార్వతి మంజులతోపాటు ఎక్కడికో బయల్దేరబోతూ కనిపించారు.

అతన్ని చూడగానే విశ్వనాథంగారి ముఖం వికసించింది.

"రావోయ్! నీకోసమే వెయిటింగ్! ఈరోజు మంచి ప్రోగ్రాం ఉంది. త్వరగా టీ తాగి, మొహం కడుక్కుని రా!" అంటూ హడావిడి చేశారు.

### యువతరం ఆటలు!

జపాను యువకులు స్కేటింగ్, స్కీయింగ్ ఆటలలో పాల్గొనటానికి ఉత్సాహం చూపిస్తున్నారు. బేస్‌బాల్, వాలీబాల్ ఆటలు కూడా అందరికీ ఇష్టమే, అయితే వీటిలో పాల్గొనటానికి ఎక్కువమంది రావటంలేదు. టెలివిజన్లో ప్రదర్శించేటప్పుడు మాత్రం ఈ ఆటలను చూస్తుంటారు. జపానులో మిట్సుబిషి సంస్థ ఇటీవల జరిపిన సర్వేలో ఈ సంగతులు వెల్లడైనాయి. విద్యార్థులు ఎక్కువగా శరీర వ్యాయామం కోసం ఆటల్లో పాల్గొంటున్నట్లు తెలియచేశారు. ఉద్యోగులు, స్త్రీలు మాత్రం ఆరోగ్యంగా ఉండేందుకు ఆటల్లో పాల్గొంటున్నట్లు తెలియచేశారు.

"ఏం ప్రోగ్రాం అంకుల్!" అని అడిగాడు ఛైర్‌లో కూర్చుని షూస్ విప్పుకుంటూ!

"వెంకటేశ్వర కళాసమితివాళ్ళు శంకరశాస్త్రిగారి సంగీత కచేరి ఏర్పాటు చేశారు. ఆయన గురించి చాలా గొప్పగా చెబుతారు. శాస్త్రీయ సంగీతంలో ఆరితేరినవారనీ, ఆయన సంగీతానికి రాళ్ళు కరుగుతాయని వినటమేకానీ నాకూ ఆ అవకాశం ఇంతవరకూ కలగనేలేదు... నువ్వూ రావాలి తప్పకుండా."

సురేంద్ర ఈ విషయాల్లో ఆయన అభిప్రాయానికి విరుద్ధం. సంగీతం, పూజలు, యోగులూ, స్వాములవార్లు... ఈ విషయాలమీద అతనికంతగా అవగాహనలేదు. అందుకే ఇబ్బందిగా మొహం పెట్టాడు.

విశ్వనాథంగారు అతని వైఖరి కనిపెట్టారు.

"నో, సురేంద్రా! నువ్వు తప్పకుండ రావాలి! మంజులకూడా ముందు రానంటే రానంది. నువ్వొస్తున్నావని చెప్తే... తనూ రావటానికి ఒప్పుకుంది. కమాన్, కమాన్" అంటూ తొందర చేశారాయన.

మంజులకేసి చూశాడు సురేంద్ర, తప్పదన్నట్టుగా మొహం పెట్టంచూసి నవ్వుకున్నాడతను.

పది నిముషాల్లో రెడీ అయ్యాడు.

కారు ఆడిటోరియం ముందు ఆగింది.

చాలా విశాలమైన స్థలంలో ఒక పక్కగా లోపలికి నిర్మించబడివుంది ఆడిటోరియం భవనం చుట్టూ రంగు రంగుల పూల మొక్కలతో, క్రోటన్స్‌తో తీర్చిదిద్దినట్టుగా వుంది. అక్కడక్కడా పూల మంటపాలు — మధ్యలో సిమెంట్ గేటుకి హాలు ద్వారానికి మధ్య పాలరాతి మంటపం, నటరాజ విగ్రహం నిలువెత్తున అమర్చబడి ట్యూబ్ లైట్ల కాంతిలో మిలమిలా మెరిసిపోతూంది. సన్నగా వీణానాదం వాయుతరంగాల్లో కలిసిపోయి తెరలుగా వినిపిస్తూంది.

ఆ వాతావరణంలోని పవిత్రత, స్వచ్ఛత, సౌందర్యం సురేంద్రను పరవశుణ్ణి చేశాయి. మాటల్లో చెప్పలేని అనుభూతి అతని మనసులో నిండి మైమరపించింది.

విశ్వనాథంగారి ఫామిలీకోసం రిజర్వ్ చేయబడిన సీట్లలో వరుసగా కూర్చున్నారు నలుగురూ! ఆ హాలంతా జనంతో నిండిపోయింది. చాలామంది పక్కద్వారాలదగ్గర నిలబడి ఉన్నారు.

కచ్చేరీ ప్రారంభం అయింది.

శంకరశాస్త్రిగారు, తమ బృందం ఆసీనులైయ్యారు స్టేజీమీద. ఆయనలో ఎంతో పవిత్రత, నిష్ఠ, పట్టుదల కనిపిస్తున్నాయి ప్రేక్షకులకు. ఆయన గురించి వినటమేగానీ చూడనేలేదు సురేంద్ర.

దాదాపు రెండు గంటలసేపు ఆయన తన శ్రావ్యమైన కంఠంతో సరిగమలు, శాస్త్రీయ సంగీత మిళితమైన కీర్తనలు మధురంగా వినిపించి శ్రోతలను మంత్ర ముగ్ధుల్ని చేశారు.

ఈ రోజుల్లో కూడా యీ సంగీతానికి ఇంత ఆదరణ చేకూర్చగలగటం పూర్తిగా ఆయన ఘనతే అని ఒప్పుకుని తీరాలనిపించింది.

ఉత్కంఠతతో వింటున్న సురేంద్ర ఓసారి







తలతిప్పి చూట్టూ చూశాడు. అనుకోకుండా అతని దృష్టి దూరంగా ఒకచోట నిలిచిపోయింది.

గుండ్రటి మొహం, అందమైన పెద్ద కళ్ళు, పైకి ఒంపు తిరిగిన కనురెప్పలు, చిన్న నోరు అప్సరసతో పోటీపడే సౌందర్యం, కట్టుకున్న లేత గులాబీ రంగునైలెక్సు చీరలో కలిసిపోయిన శరీరపు ఛాయ...

బైట వరండాలో ట్యూబ్‌లైట్ల వెన్నెల కాంతి— కొద్దిగా తలుపు తెరచి ఉండటంతో ఆమె మీద ప్రసరించి మరింత ఆకర్షణీయంగా వెలుగుతోంది ఆమె అందం.

తదేకంగా సంగీతం వినటంలో నిమగ్నమై పోయిన ఇరవైయ్యేళ్ళ ఆ యువతిమీద నిలిచి పోయాయి అతని చూపులు.

సురేంద్ర గుండె లయ తప్పి కొట్టుకోవటల మొదలు పెట్టింది.

అంతటి అద్భుత సౌందర్యాన్ని అంతకు ముందెక్కడా చూడనట్టు కళ్ళార్పకుండా చూడ సాగాడు అతను.

ఆమె దీక్షగా శంకరశాస్త్రిగారినే చూస్తుండటం వల్ల, కంటికిందుగా దిద్దిన కాటుక రేఖ లోయలమధ్య సుతారంగా ఒంపు తిరిగిన సెలయేరులా వుంది.

ఒక మహాశిల్పి చెక్కిన అద్భుత శిల్పంలావుంది.

చాలాసేపు ఆమె నిలబడే ఉండటం వల్ల అసౌకర్యంగా కదిలింది ప్రక్కకి. ఆ కదలిక వల్ల సున్నితమైన త్రాచుపాములా వేలాడుతున్న జడ వయ్యారంగా కదిలింది.

యౌవనం ఆమె శరీరంలోని ప్రతి అణువు లోనూ తొణికిసలాడుతోంది. అతనిలో ఆనందం, ఆత్రుత, వెన్నెల ఒక్కసారిగా విరిసిన అనుభూతి ... మనసు పులకించిపోయింది.

ఎవరీ అద్భుత సౌందర్యరాశి? దివినుంచి భువికి దిగిన దేవతలా ఉంది! ఆమెను చూస్తుంటే తన హృదయం ఎదుకిలా లయతప్పుతోంది?

ఇంతగా తనని ఆ యువతి ఎందుకు ఆకర్షిస్తోంది?

తన మనసు ఆమెతో పరిచయాన్ని కోరుతుందా! ఆమె సహచర్యాన్ని అభిలషిస్తోందా!

ఆమె ఎవరో? తనెవరో!!

విచిత్రంగావుంది అతని మానసికస్థితి. పరిపరి విధాల ఆలోచించసాగాడు ఆ కొద్దిక్షణాల్లోనే!

ఏవో శబ్దాలూ, మాటలూ అతన్ని ఆలోచనలనుంచి వేరుచేశాయి.

ఉలిక్కిపడి... తేరుకుని చుట్టూ చూశాడు. అందరూ బైటకు వెళ్ళిపోతున్నారు.

ప్రోగ్రాం ముగిసినట్టుంది.

"సురేష్! ఇక వెళ్దామా" అంది మంజుల అతని చేయి పట్టుకుని. ఆమె తనని గమనించిందేమో నని గతుక్కుమన్నాడు అతను.

ఏదో చెప్పబోయేంతలో "మంజూ" అంటూ తియ్యని కంఠం వినిపించి ఇద్దరూ అటు చూశారు.

ఆమె తీయని స్వరమే అది. అప్పటివరకు తనని మత్తులో ముంచిన ఆ యువతి తమకి దగ్గరగా రావటం గమనించాడు.

"మంజూ, ఈ రోజు నాకెంత ఆశ్చర్యంగా వుందో తెలుసా! నువ్విలాంటి ప్రోగ్రామ్స్‌కి రావటం ఎప్పటినుంచీ నేర్చుకున్నావు. అంకుల్ బలవంతం మీద వచ్చావా పాపం! అవునూ, అంకుల్ ఆంటీ, ఎవరూ కన్పించరే?" అంటూ ప్రశ్నలవర్షం కురిపించిందామె.

మంజుల నవ్వింది. "వాళ్ళు ముందు నడుస్తున్నారు. నేనూ, సురేంద్ర..." అంటూ ఒక్క క్షణమాగి, "అరే, మర్చిపోయాను గాయత్రీ! ఈయన మిస్టర్ సురేంద్ర. ఇంజనీరుగా ఈ మధ్యే తిరుపతి వచ్చారు. మా యింట్లోనే వుంటున్నారు." అంటూ పరిచయం చేసింది

"నమస్తే" అంది రెండు చేతులు జోడించి అందంగా! అన్యమనస్కంగా ప్రతి నమస్కారం చేశాడు అతను.

"సురేన్! ఈమె గాయత్రి. మా కుటుంబానికి అత్యంత సన్నిహితురాలు. నాకు ప్రియ మిత్రురాలు. నువ్వు వచ్చిం తర్వాత గాయత్రి మనింటికి రాలేదు కదూ! నేనైతే ప్రతి రెండు రోజుల కొకమారు వెళ్ళాలి. తను మాత్రం రాదు. గట్టి పనిష్మెంట్ ఇవ్వాలి" అంది కోపం నటిస్తూ.

ఆమె నవ్వింది అందంగా!

ఆ నవ్వు సెలయేటి సంగీతంలా వినిపించింది అతనికి. 'గాయత్రి' ఆమె సౌందర్యం వల్ల ఆ పేరుకి అందం వచ్చినట్లుంది.

ఆమెతో పరిచయం...అతని మనసు ఆనందంతో ఊగిపోతూంది.

వాళ్లిద్దరూ మాటల్లో పడిపోయారు.

సురేంద్ర కవేమీ వినిపించటం లేదు. అక్కడ నిల్చోటం బావుండదని నెమ్మదిగా నడుచుకుంటూ కారు దగ్గరికి బయల్దేరాడు. అతని వెనుకే వాళ్లిద్దరూ నడిచారు.

బైటకొచ్చిన తర్వాత విశ్వనాథం, పార్వతిగార్లు గాయత్రిని చూసి ఆప్యాయంగా పలకరించారు —

"ఏమ్మా గాయత్రీ! రావటమే మానేశావు. మా మీదేమైనా కోపం వచ్చిందా?"

ఆ మాటలకి ఆమె నొచ్చుకుంది. "మీ మీద అలగటమేమిటి అంకుల్. కిరణ్‌కి జాండిస్ వచ్చింది, అందుకే ఎక్కడికీ వెళ్లటానికి రావటానికి వీలులేక పోతోంది" అంది.

"ఇప్పుడెలా ఉంది?"

"ఫర్వాలేదు. తగ్గిపోయింది. అందుకే ఈ రోజు రాగలిగాను."

మంజుల తల్లి గాయత్రి భుజం మీద చేయివేసి "వీలు కుదిరినప్పుడు తప్పకుండా రామ్మా! రేపు మంజుల వస్తుందిలే మీ యింటికి" అన్నారావిడ.

గాయత్రి చిన్నగా నవ్వింది.

"గాయత్రి కారెక్కమ్మా! మీ యింటి దగ్గర డ్రాప్‌చేసి వెళ్తాం" అన్నారు విశ్వనాథంగారు.

"అలాగే; అంకుల్!" అంటూ తలూపింది గాయత్రి.

* * *

ఈజీఛైర్‌లో కూర్చుని దీక్షగా లెటరు రాసుకుంటున్నాడు సురేంద్ర. ఎప్పుడొచ్చి అతని వెనుక నిల్చుందో 'హాండ్సప్' అని చేతివేళ్ళను పిస్టల్‌లా పెట్టి గట్టిగా అరిచేసరికి ఉలికిపాటుగా వెనక్కితిరిగి చూశాడు అతను.

ఆలీవ్‌గ్రీన్ శారీలో మెరిసిపోతూ, పిస్టల్లా చేతివేళ్ళతో ఆమె పెట్టిన పోజు చూసి, భయపడు తున్నవాడిలా, బిక్కుబిక్కుమంటూ అటు ఇటూ చూస్తూ, చేతులు రెండూ పైకెత్తి నిల్చున్నాడు.

గట్టిగా పకపకా నవ్వుతోంది మంజుల. ఆమె నవ్వుతో అతను శృతి కలిపాడు.

"సురేన్! ఎవరికీ అంత దీక్షగా ఉత్తరం రాస్తున్నావు. ఎవరైనా గర్ల్ ఫ్రెండా?" అంది ప్రక్కన ఛైర్‌లో కూర్చుంటూ!

అతను నవ్వి, "గర్ల్ ఫ్రెండుకైతేనే అంత దీక్షగా రాస్తారా! వట్టి అల్లరి పిల్లవి. నేను లెటర్ రాసేది మా నాన్నగారికి" అన్నాడు.

"ఓహో, నాన్నగారికే కదా! ఏ గర్ల్ ఫ్రెండ్‌కో




Issued by: Raveekant Nagaich, 22, Hindi Prachar Saba St., T. Nagar, Madras-17.

## ఇవేమన పద్యాలు




కూలి వాలజేసి గుల్లాము పనిచేసి
తెచ్చి పెట్టెనేని మెచ్చువాలు
చిక్కుబడ్డవేళ చీకాకు పఱచురా
విశ్వదాభిరామ వినురవేమ.

## ఇది మేఘ సందేశము...

అయితే లాక్కుని చదివేదాన్ని. అవునూ, సురేష్, నువ్విక్కడ ఉన్నావు కదా! మరి మీ నాన్నగారక్కడ ఒక్కరే..." అంటూ ఆగిపోయి చూసింది.

సురేంద్ర ముఖంలో ఆనందపుఛాయలు కాస్త మసకబారాయి.

"తల్లి ప్రేమకు నోచుకోనివాడినని మా నాన్నగారు నన్నెంతో గారంగా, ప్రాణంగా చూస్తారు మంజులా. తల్లి ప్రేమ గానీ, అక్కచెల్లెళ్ళ అన్నదమ్ముల అనురాగానికిగానీ నోచుకోని నేను, అన్నీ ఆయనలో చూసుకుంటున్నాను. ఆయన్ని వదిలి ఉండాలంటే నాకెంత బాధగా ఉంటుందో!"

"అదేమిటి? మీ నాన్నగార్ని కూడా తీసుకు రాలేకపోయావా!"

"నేనూ అలానే అనుకున్నాను. కానీ ఆ పొలాలు, మిల్లులు వదిలి ఎక్కడికీ రారు. పైగా నా పెళ్ళి గురించి పెద్ద బెంగ. త్వరగా పెళ్ళి చేసుకుని ఒకింటివాడివి కమ్మని, నాకు పుట్టే పిల్లలతో ఇల్లు కళకళలాడుతుంటే చూడాలని ఆయన కోరిక."

"పోనీ సురేష్! ఆ ఏజ్‌లో ఆయన్ని బాధ పెట్టపోతే ఆయన చెప్పినట్టు పెళ్ళి చేసుకో కూడదా! నీకేం తక్కువ. అందముంది, ఒంటెలాగ ఆరడుగుల పొడవు, చదువు సంస్కారం ఉన్న నిన్ను ఏ అమ్మాయి కాదంటుంది. ఇంతకీ నీకెలాంటి అమ్మాయి కావాలి చెప్పు!" నవ్వుతూ అడిగింది.

"నీలాంటి గయ్యాళి పిల్ల, అల్లరిపిల్ల మాత్రం వద్దు" వెక్కిరిస్తూ అన్నాడు.

"ఏమిటే, నేను గయ్యాళినా!" కొంగు నడుము చుట్టూ బిగిస్తూ లేచి నిలబడి కాళ్ళు వెడల్పుచేసి అంది.

"మరి నేను ఒంటెనా?!" గట్టిగా నవ్వేశాడు.

ఆమె కోపం ఒక్కసారిగా తగ్గిపోయింది. "ఓహో, అదా నీ కోపం. సరే కాని, నీక్కాబోయే భార్య ఎట్లా ఉండాలి చెప్పు సురేష్!" అంది ఆప్యాయంగా.

"మంజులా! నా భార్య పేదింటి పిల్లయినా చదువుండి సంస్కారవంతురాలై ఉండాలి. మనిషిని మనిషిగా చూసి గౌరవించాలి. ఆస్తిని చూసి, తక్కిన విలువల్ని తేలిగ్గా చూడని సహృదయురాలై ఉండాలి. ఆమె అందం అప్పుడే విచ్చిన మల్లెపూవులా వుండాలి ..."

ఇంకేదో చెప్పబోతుంటే మంజుల రెండు చేతులు జోడించి నమస్కారం చేస్తూ, "శ్రీశ్రీశ్రీ రాజాసురేంద్రవర్మ గారూ! మీకు కావలసిన భార్య దొరకాలంటే ఈ జన్మంతా తపస్సు చేయండి. వచ్చే జన్మకు తప్పకుండా మీ కోరిక నెరవేరుతుంది. అదృష్టముంటే ఈ జన్మలోనే నెరవేరవచ్చునేమో... మీ కాబోయే భార్యకు ఉండవలసిన క్వాలి కేషన్స్ లిస్ట్ ఒకటి నాకు రాసివ్వండి. నేనూ ట్రై చేస్తాను" అంది అతని మాటలకు అడ్డుతగులుతూ నాటక ఫక్కీలో!

సురేంద్ర పకపకా నవ్వాడు. "ఫో, అల్లరి పిల్ల" అంటూ.

మంజుల సురేంద్రను అభిమానంగా చూస్తూ, "సురేష్ నీ మనసు నిండుకుండ లాంటిది. ఏ విషయంలోనూ త్వరగా బైటపడవు!" అంది.

అతను మౌనంగా ఉండిపోయాడు.

"అవునూ మంజూ, ఇంతకీ ఏమిటిలా వచ్చావు" అన్నాడు చేతిలో కవరు ప్రక్కన పెడుతూ.

"ఏమీలేదు సురేష్! నేను గాయత్రి వాళ్ళ యింటికి వెళ్తున్నాను. నువ్వు కూడా సరదాగా రాకూడదూ?"

"నేనా?" సంభ్రమంగా చూశాడు.

"ఏం, రావా?"

ఒక్కక్షణం అతను ఆలోచనలో పడ్డాడు. "గాయత్రిని చూడాలని అతనిమనసు తహతహ లాడు తోంది. కానీ 'రా' అనగానే వెళ్తే మంజుల ఏమైనా అనుకుంటుందేమో" అనుకున్నాడు మనసులో.

"నేనెందుకు మంజూ. నువ్వెళ్ళిరా! వాళ్ళు నాకు తెలీదు కదా!" అన్నాడు మొహమాటంగా.

"వాళ్ళు తెలీకపోవటం ఏమిటి? గాయత్రి తెలుసుకదా! దానికోసమే మనం వెళ్ళేది. సరదాగా వెళ్ళివద్దాము సురేష్!" అంది బ్రతిమాలుతున్నట్టు.

లేచి డ్రెస్ చేసుకుని ఆమెతో బయల్దేరాడు. గాయత్రిని చూడబోతున్న అతని మనసు ఉత్సాహంగా ఉంది. బైటకు వచ్చిన తర్వాత "హాయిగా ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ నడుద్దాం" అంది ఆమె.

వాళ్ళిద్దరూ అలా నడిచి వెళ్తుంటే సంబరంగా చూసుకుంటున్నారు మంజుల తల్లిదండ్రులు వెనకనుండి.

**(ఇంకా ఉంది)**






బులుసు వేంకటరమణయ్య

# జయంతులు - వర్ధంతులు

ప్రతి సంవత్సరం అందరూ పుట్టినరోజున పండుగ చేసుకుంటారు. అలాగే ఎవరయినా మరణించిన తర్వాత సంవత్సరానికి ఒకసారి ఆ మృతదినంనాడు వారిని స్మరిస్తూ శ్రద్ధగా పితృకార్యం చేసుకుంటారు. ఇది సామాన్యుల విషయం. మహనీయులైన మతకర్తలు, గొప్ప దేశనాయకులు జన్మించిన దినం జయంతి అని అంటారు. వారు మరణించిన దినం వర్ధంతి అని వాడుకలోకి వచ్చింది. మృతదినం అంటే బాగుండదని వర్ధంతి అని చెప్పినట్లున్నది. జయంతులు జరుపుకుంటున్నంత తరుచుగా వర్ధంతులు జరుపుకుంటున్నట్లు తోచదు. అవతారమూర్తుల జన్మదినోత్సవాలు శ్రీరామ జయంతి, నృసింహ జయంతి, శ్రీకృష్ణ జయంతి జరుపుకుంటున్నట్లు భారతపిత గాంధీ మహాత్ముని జయంతి జరుపుకుంటున్నాము. ఆ రీతిగా నెహ్రూ జయంతిని పిల్లల ఉత్సవదినంగా జరుపుకుంటున్నాము. మహాత్మాగాంధీజయంతితో పాటు ఆయన వర్ధంతినికూడా జరుపుతున్నారు. దానికి సర్వోదయ దినం అని పేరు పెట్టారు. వీటిని జరుపుకోవడంలో ఉద్దేశం ఏమిటి? అని కొందరు ప్రశ్నించవచ్చును.

అవతార పురుషుల జయంతులు జరిపి నప్పుడు ఆయా అవతారాల వైశిష్ట్యం స్మరణకు వస్తుంది. ప్రజాక్షేమానికి వారు చేసిన మహా కార్యాలవల్ల వారిపై భక్తిభావం దృఢపడుతుంది. మతకర్తల జయంతులవల్ల వారి ఉత్తమాదర్శాలు అవగతమవుతాయి. అందువల్ల ఆ ఉత్తముల అడుగుజాడల్లో నడవడానికి ప్రయత్నం చెయ్యడానికయినా సాధ్యమవుతుంది.

కొందరా ఉత్తమాశయాలను అనుసరించాలని పూనుకుని, తమతోపాటు కొందరికి ప్రోత్సాహం కలిగిస్తూ, ఆ దినాలలో తప్పక ఆ మహనీయులు అడుగుజాడల్లో నడుస్తారు. కాని, మరునాటినుంచీ ఉత్సాహం తగ్గుతూ ఉన్నట్లు కానవస్తున్నది. మళ్లీ ఒక సంవత్సరానికిగాని, ఆ ఆశయాలు గుర్తుకురాని పరిస్థితులూ ఏర్పడుతున్నాయి. మహాత్ముని జన్మదినంనాడూ, ఆయన దేహం చాలించిన సర్వోదయ దినం లోనూ దీక్షతో సాగుతూ ఉండే సూత్రయజ్ఞం ఇతర దినాల్లో జరుగకపోవడం దీనికి ఉదాహరణం. ఇట్టి దీక్షలు కొనసాగుతూ ఉండాలే కాని నడుమ విరిచిపోకూడదు. ★

సీరియల్

# అతడు అడవిని జయించాడు

డా॥ కేశవరెడ్డి

## 5

(గత సంచిక తరువాయి)

అడవిలో అతడు నడవడానికి నిర్ణీతమైనదారులు లేవు. అతడు బండలమీదుగా, కణికి రాళ్ళ మీదుగా నడుస్తున్నాడు. మిట్టలను ఎక్కుతూ, పల్లాలను దిగుతూ సాగుతున్నాడు. పచ్చికను తొక్కుకుంటూ, చిన్నచెట్లను తొలగ దోసుకుంటూ నడుస్తున్నాడు.

అడవి జంతువులు అవిరామంగా నడవడం వల్ల ఏర్పడిన సన్నటి దారిమీద అతడు నడవసాగాడు. ఆ దారి మరీ అస్పష్టంగా ఉంది. కొంతసేపటికది గారడి యుక్తివలె గురివెంద పొదల మధ్య మాయమైపోయింది. అందుకతడు వగచలేదు. 'ఈ దారులు ఎటూ కానిచోట ప్రారంభమై ఎటూ కానిచోట అంతమౌతాయి. ఇలాంటి దారుల వెంబడి నడవడం శుద్ధ దండగ' అనుకున్నాడతడు.

అతడు అరణ్యం మధ్యకు పురోగమిస్తున్నాడు. పొదలను గుహలను వెదకుతున్నాడు. మాట మాటికి ఎలుగెత్తి, "హూచ్ హూచ్" అని అరుస్తున్నాడు.

అతడు తాగిన కల్లు తన ప్రభావాన్ని చూపుతూ ఉంది. ఒళ్ళంతా వెచ్చగా అవుతున్నట్లు, పాదాలు గాలిలో తేలుతున్నట్లు అనిపిస్తూంది. అతనికి హాయిగా ఉంది. చంద్రుడు నవ్వుతున్నట్లుగా, చెట్లు నాట్యం చేస్తున్నట్లుగా, గాలి సుగంధ పరిమళాన్ని మోసుకుని వస్తున్నట్లుగా అతనికి తోస్తున్నది. 'కడుపులో ఈతకల్లు మరుగుతున్నది. ఆవిర్లు ఎగదన్నుతున్నాయి' అనుకున్నాడతడు. కల్లు ఎంత మైకం కలిగించినాగాని పందిని గురించిన ఆరాటం అతనిలో కించిత్తయినా తగ్గలేదు.

అడవి జంతువులు ఏర్పరచిన దారి మళ్ళీ ఒకటి అతనికి తటస్థించింది. ముసలివాడు, 'నిద్రలో కనిపించే కలల వలె ఈ దారులు తలా తోకా లేకుండా ఉంటాయి' అనుకుంటూ ఆ దారిమీద నడవసాగాడు. దారిమీద పలురకాలైన జంతువుల అడుగు జాడలున్నాయి. వాటిని తొక్కుకుంటూ అతడు నడవసాగాడు.

తన గుడిసె ప్రమాణమున్న పొదలను చుట్టి వస్తూ, చంద్రుని కిరణాల కభేద్యమైనంత దట్టంగా ఉన్న వృక్షాల కిందుగా నడుస్తూ, అగాధమైన లోయలనుదాటుతూ, దీవులవంటి బండలను ఎక్కి దిగుతూ అతడు సాగుతున్నాడు.

అతడు తలయెత్తి చూస్తే వృక్షాల మధ్య ఆకాశం కొంత కనిపిస్తుందేగాని సూర్యుడిని తన వెనక దాచుకున్న పడమటి కొండగాని, చంద్రుడిని ఆకాశంలోకి విసరిన తూర్పు కొండగాని కనిపించడం లేదు. అతన్ని పరివేష్టించి వృక్షాలు, పొదలు, గుట్టలు గంభీరంగా నిలుచుని ఉన్నాయి. అడవిలో నుండి ఉద్భవించిన ధ్వనులు అవిరామంగా వినిపిస్తున్నాయి. కంటికి కనిపించకపోయినప్పటికీ ఆ ధ్వనులను కలగజేస్తున్న ప్రాణులను అతడు క్షుణ్ణంగా ఎరుగును. కాని అతని అవగాహనకు అతీతమైన ధ్వనులు చాల ఉన్నాయి. ఆ ధ్వనులు ఎలా పుట్టుతాయో, వాటి అంతరార్థమేమిటో అతనికిగాని, అతని పూర్వీకులకుగాని అంతుపట్టలేదు. 'అడవి నిగూఢమైనది. ఏ అనుభవానికీ, ఏ మేధస్సు అంతుచిక్కని రహస్యాలు ఇక్కడ చాలా ఉన్నాయి.' అనుకున్నాడు ముసలివాడు.

'కాని నా అనుభవం మాత్రం స్వల్పమైనది కాదు' అనుకున్నాడతడు. ఇరవయ్యేండ్ల ప్రాయంలో అతడు ఒక కీకారణ్యంలో రెండేడ్లపాటు కాపురమున్నాడు. అప్పట్లో ఈ ప్రాంతంలో భయంకరమైన కరవు సంభవించింది. గడ్డిలేక పశువులు మందలు మందలుగా రాలిపోసాగాయి. ఈ ప్రాంతంలో ఒక భూస్వామి ముసలివానికి [అప్పట్లో యువకుడు] ఒకమంద పశువులను అప్పగించి యాభై మైళ్ళ దూరాన ఉన్న 'సుగాలోల్ల అడవి'కి తోలుకొనిపోయి వర్షాలు పడి కరవు తీరేవరకు తిరిగి రావద్దని ఆదేశించాడు. పశువులను మేపుకుంటూ, వాటిని క్రూరమృగాల బారినుండి కాపాడుతూ తాను అడవిలో గడిపిన రెండేండ్ల కాలంలోని ప్రతి దినాన్నీ అతడు ఒళ్ళు గగుర్పొడిచే అనుభవాలతో గడిపాడు. నాలుగు తరాలకు సాక్షులువలె నిల్చునిఉండే చెట్లకింద, ఆది మధ్యాంతాలు తెలియని తీగలతో నిర్మించిన పొదల కింద, కూతవేస్తే జాముసేపు ప్రతిధ్వనించే చీకటి గుహల్లో అతడు నివాసమున్నాడు. నక్కలను, చిరుతులను ఎదుర్కొంటూ, జింకలతోడి, అడవి కోళ్లతో స్నేహంచేస్తూ, కుందేళ్లను, ఏదుపందులను వేటాడుతూ అతడు జీవించాడు. ఆ అనుభవాలన్నింటినీ నెమరువేస్తూ ముసలివాడు, 'అడవి మహా చిత్రమయింది. దాని రహస్యాలు బహుశ దానికే తెలియవేమో' అనుకున్నాడు.

చంద్రుడు చల్లగా వెలుగుతున్నాడు. పచ్చిక పైన, చెట్లపైన, లోయలమీద పర్వతాలమీద వెన్నెలకురుస్తున్నది. వైశాఖమాసపు ఎండలకు శోషిల్లి ఉండిన ప్రకృతి వెన్నెలను ఆస్వాదిస్తూ సేదదీర్చుకుంటున్నది.

అడవిలోని శబ్దాలు క్రమక్రమంగా సన్నగిల్లుతున్నాయి. ప్రాణాలు ఒక్కటొక్కటే నిద్రాదేవి ఒడిలోకి జారుకుంటున్నాయి.

చంద్రుని కిరణాల తాకిడికి తెలివి తెచ్చుకుని తలలు పైకెత్తుతున్న గడ్డిని, మొక్కలను తొక్కుకుంటూ ముసలివాడు నడుస్తున్నాడు.

రెండు శిలలు ఒకదానికొకటి ఆనుకొని ఉండగా ఏర్పడిన గుహ ఒకటి దారికి కుడిపక్కన కనిపించింది. ముసలివాడు గుహ ముందు నిల్చుని అరచేతులను నోటిచుట్టూ పెట్టుకుని "హూచ్ హూచ్" అని అరచాడు. గుహ చీకటిగా ఉంది. చంద్రుడు దాదాపు నడి ఆకాశంలో నిలిచి ఉండడం వల్ల వెన్నెల గుహ లోపలికి ప్రసరించడంలేదు. గుహ ముందు ద్వారపాలకులవలె రెండు ముష్టి చెట్లున్నాయి. అతడు ఈటెను కిందపెట్టి గుహలోపలకు పోయే దారి మీద పంది తాలూకు అడుగుల గుర్తుల కోసం నడుంవంచి వెదకసాగాడు. గతవారం కురిసిన తొలి ముంగార్ల వానల మూలాన అక్కడ పచ్చగడ్డి ఒత్తుగా పెరిగి ఉంది. ముసలివానికి అనుకూలించే గుర్తులేవీ కనబడలేదు. అతడు రెండు రాళ్లను చేతిలోనికి తీసుకుని చీకటిమయంగా ఉన్న గుహలోనికి విసిరాడు. గుహకు పక్కగా నిలుచుని ఫలితం కోసం చూడసాగాడు. 'నేను జాగ్రత్తగా ఉండాలి. ఒకవేళ సుక్కపంది గుహలో ఉండి నా ఉనికిని గ్రహిస్తే మరుక్షణమే అది పులివలె మీదకు దుముకుతుంది. అందినది కాలో చేయో నంజర నంజగా కొరికి పారేస్తుంది. ప్రాణం తీసినా తీస్తుంది. అది మొరటు జీవం. శత్రువులు, శ్రేయోభిలాషులు అని చూసుకొనే ఇంగితం దానికి లేదు." అనుకున్నాడు ముసలివాడు. గుహలోపల నుండి ఏ సంభవమూ కానరాలేదు. అతడు గుహ ద్వారానికి చేరువగా వెళ్లి ముష్టిచెట్ల వద్ద నిలుచుని కొంతసేపు గాలిని గట్టిగా పీల్చి, తల అడ్డంగా ఊపుతూ వెనక్కి తిరిగాడు. ఇంతలో అతని వెనక నుండి గబగబ మని శబ్దం వచ్చింది. ముసలివాడు బిసకంప వలె చెంగున ఎగిరి ఈటె వద్ద దూకి దానిని చేత బుచ్చుకుని గిరుక్కున వెనకకు తిరిగాడు. నాలుగైదు గబ్బిలాలు రెక్కలు కొట్టుకుంటూ గుహ నుండి బయటకొచ్చి ఎగిరిపోవడం కనిపించింది. ఈటె చుట్టూ బిగుసుకుని ఉండిన అతని కుడిచేతి వేళ్ళు సడలినాయి. ఎడమ చేతిని ఎదమీద వేసుకుని, 'సుక్కపంది అనుకుంటి. గుండె ఆవులించిపోయింది.' అనుకున్నాడు

---

**జరిగిన కథ — 1 :** ముసలివాడు ఆజానుబాహుడు. అతని ఆస్తి పందులు. అతని మనుమడు మేతకై పందుల్ని తోలుకొనిపోయి తిరిగి రానందుకు ఆందోళన చెందాడు. వెతుక్కుంటూ బయలుదేరిన అతనికి పిల్లవాడు, పందులు రావడం కనుపించింది. కాని వాటిలో ఈనడానికి సిద్ధంగా ఉన్న ముక్కపంది కనుపించలేదు. దాన్ని వెతుక్కుంటూ అడవి వైపు నడవసాగాడు.

---

అతడు మళ్ళీ నడక ప్రారంభించాడు. అడవి దిగంతాల వరకు భూమిని కప్పి ఉన్నట్లు కన్పట్టుతున్నది. పొదలు, గుహలు, చెట్లు, లోయలు, శిలలు ఒకదానికి భిన్నంగా మరొకటి, ఒకదానికన్న ఉన్నతంగా మరొకటి ఉన్నాయి. కాలుతున్న బండమీద వదలబడిన చీమవలె. సందెచీకటిలో ఆకలిగొన్న మిణుగుర పురుగువలె అతడు తిరుగుతున్నాడు. నడచిన ధారి మీదుగనే తాను మళ్ళీ నడుస్తున్నట్లు అతనికి అప్పుడప్పుడు అనుమానం కలుగుతూ ఉంది. 'ఈ అడవిలో సుక్కపంది ఏ మూలన ఉందో, ఏ పరిస్థితిలో ఉందో. అద్భుతాలకు ఆలవాలమైన ఈ అడవిలో, తామసానికి ఆటపట్టయిన ఈ అడవిలో, ప్రాణమెదిగినంతగా మనసు ఎదగని ఈ అడవిలో సుక్కపందికి ఏ ముప్పు వాటిల్లిందో.' అనుకున్నాడు ముసలివాడు.

## 6

అతని కాళ్ళు నొప్పిపెడుతున్నాయి. కల్లు కలగ జేసిన మాయ క్రమక్రమంగా అంతరించిపోతున్నది. 'ఏ సంభవానికైనా అవకాశమున్న ఈ అడవిలో లీనమైపోయిన సుక్క పంది ఇక నాకు దక్కదేమో' అనుకున్నాడు ముసలివాడు. చుట్ట చుట్టుకుని నిద్రిస్తుండిన పాముపిల్ల మేలుకుని తలపైకెత్తినట్లు నిరాశ అతని మానసంలో ఒక మూల కదిలింది.

ఏడాది క్రితం ఒకసారి సరిగ్గా ఇలాంటి పరిస్థితుల్లోనే ముసలివాని పొరుగువాడైన ఎరుకలవాడు తన పందిని పోగొట్టుకున్నాడు. ఎరుకులవాడు పందికోసం అడవంతా గాలిస్తూ మూడు పగళ్ళు, మూడు రాత్రులు గడిపాడు. చివరకు రిక్తహస్తాలతో తిరిగి వచ్చాడు. ఆరునెలల తరవాత ఉప్పుచెక్క కోసం అడవికి వెళ్ళిన కాపువాళ్ళు కొందరు ఆ పంది మాయమైన వైనం తెలుసుకోగలిగారు. దట్టంగా ఉన్న ఒక పొదలో పంది తాలూకు ఎముకలు తెల్లగ మెరుస్తూ వారికి కనిపించాయి. పంది మెడకు ఉండిన గజ్జెకూడా ఎముకల మధ్య వారికి కనిపించింది. ఎలుగుబంటిగాని, పెదనక్కగాని దాన్ని చంపి తిని ఉంటుందని కొందరు భావించారు. చెంచువాళ్ళు దాన్ని చంపి, విందు చేసుకుని ఉంటారని మరికొందరు భావించారు.

'కాని నేను ఎరుకలవాడివలె చవటను కాను' అనుకున్నాడు ముసలివాడు. అతడు చెట్ల మధ్య నడుస్తూ 'నేను 'సుగాలోల్ల అడవి'లో రెండు సంవత్సరాలపాటు కాపురమున్నాను. పందుల్ను కొనడానికి వచ్చే వాడుక దారుల మాటలకన్న సులువుగా నేను జంతువుల భాషను అర్థం చేసుకోగలను. చెట్లు తమ కొమ్మల కదలికలతో, ఆకుల గలగలలతో ఇచ్చే సందేశాలు నాకు కరతలామలకం' అనుకున్నాడు.

సుగాలోల్ల అడవిలో తాను పశుల కాపరిగా ఉండినప్పటి ఒకనాటి సాయంత్రం అతనికి జ్ఞాపకమొచ్చింది. జనం తొలి ముంగార్లవానల కోసం ఎదురు చూస్తున్న రోజులవి. పశులకాపరులందరు నిద్ర వచ్చేంత వరకు కథలు చెప్పుకుని గుడిసెలో పడుకున్నారు. ఆరుబయట పసువులన్నీ కట్టుగొత్తలకు కట్టివేయబడి ఉన్నాయి.

అర్ధరాత్రప్పుడు వాన ప్రారంభమయింది వర్షంతోబాటు మంచురాళ్ళు పడసాగాయి. రాళ్ల గుడిసె కప్పుమీద దడదడపడుతుండడంతో పశుల కాపరులందరు మేలుకుని బయటకొచ్చారు బయటంతా చీకటిగా ఉంది. గాలి, వాన, ఉరుములు కలిపి సృష్టిస్తున్న బీభత్సం వాళ్ళకు అనుభవమవుతున్నది. గాలి తూర్పు దిశనుంచి బెస్సుమని వీస్తున్నది. గాలిపాటువలన చినుకులు, మంచురాళ్ళు



పెటవాలుగా పడుతున్నాయి. రాళ్ళు అవిరామంగా పడుతుండడంవల్ల పశువులు కట్టుగొయ్యిల వద్ద యిడుగులాడుతూ ఉండడం చీకటిలో తేలిగా కని పిస్తున్నది.

వాళ్ళు గబగబ పశువులన్నిటినీ కట్టుగొయ్యిల నుండి విప్పి చెట్టుకిందకు తోలుకొచ్చారు. ఒక కట్టుగొయ్యి వద్ద తెగిపోయిన— సగం పగ్గం ముసలి వానికి కనిపించింది. చెట్టుకింద గుంపుగా తోలిన పశువులను లెక్కపెట్టగా ఒక ఎనుబోతు మాయమై ఉన్నట్టు తెలిసింది. రాళ్ళవాన ప్రారంభం కాగానే ఎనుబోతు పగ్గం తెంచుకుని ఎటో పారిపోయింది. దాన్ని పట్టి తేవడానికై వెంటనే బయలుదేరాలని వాళ్ళు సంకల్పించుకున్నారు. ఏ వైపుగా వెళ్ళాలన్న అంశం మీద కొంచెం సేపు తర్జన భర్జన జరిగింది.

అక్కడి పరిసరాలన్నీ వాళ్ళకు క్షుణ్ణంగా తెలుసు. వాళ్ళున్న చోటునుండి తూర్పుగా ఒక సువిశాలమైన మైదానం ఉంది. ఆ మైదానంలో పచ్చిగడ్డి, గులకరాళ్ళు తప్ప మరేమీలేదు. మిగిలిన మూడు దిక్కులలో మహోన్నతమైన వృక్షాలున్నాయి.

## అతడు అడవిని జయించాడు

తప్పిపోయిన ఎనుబోతును తూర్పు దిశగా వెళ్ళి వెదకుదామని ముసలివాడు చెప్పగా అతని సహచరులు ఒప్పుకోలేదు. అతని వాదనలో కించిత్తయినా ఇంగితం లేదని వారతన్ని ఎగతాళిచేశారు. తల దాచుకోవడానికై పశువులు చెట్టున్న వైపుగా వెళ్తుందే గాని మైదానం వెంబడి పరుగెడుతుందా? అని వాళ్ళు వాదించారు. వాళ్ళతో వాదిస్తూ కాలయాపన చేయడం ఇష్టంలేక ముసలివాడు తానొక్కడే తూర్పు వైపుగా బయలుదేరాడు. బాగా ముదిరి దళసరిగా ఉన్న తాటిపట్ట నొకదాన్ని నరికి గొడుగు వలె పట్టుకుని రాళ్ళ వాన నుండి తలను కాపాడుకుంటూ అతడు పరుగెత్తసాగాడు.

తూర్పు వైపున మైదానం ఉండడం మాత్రం అతని సహచరులు గమనించారు గానీ, ఆ వైపు నుండే గాలి వీస్తుండడం, ఆ వైపు నుంచే చినుకులు పెటవాలుగా పడుతుండడం వారు గమనించలేదు. కళ్ళు కనిపించని చీకటిలో తగులుకుని ఉన్నప్పుడు వర్షం ప్రారంభమైతే ఏ వైపునుండి చినుకులు పెటవాలుగా పడుతున్నాయో, ఏ వైపు నుండి గాలి వీస్తున్నదో ఆ దిక్కుగా ఎనుబోతులు పరుగెత్తడం ప్రారంభిస్తాయి. అప్పటి వాటిపోకడ చేపలు ప్రవాహాని కెదురీదుతున్నంత స్వాభావికంగా ఉంటుంది. చీకటి, వర్షం, ఉరుములు, మెరుపులు కలిగించిన భీతి వలన అవి తోకలను వంచుకుని, కొమ్ములను ముందుకు చాచుకుని దయ్యం పూనినట్టుగా పరుగెడతాయి. అవి అలా అవిరామంగా పరుగెడుతూ కేవలం అలసట వల్లనే ప్రాణాలు వదలడం, అగాధమైన లోయల్లోకి దూకి దుర్మరణం పాలుగావడంకూడా కద్దు.

ఆ పూట అతడు రాళ్ళవానలోపడి జాముసేపు పరుగెత్తగా ఎనుబోతు అతని కంటబడింది. అల్లంత దూరాన అది తోక పైకెత్తుకుని, మూతి నేలకు తగిలేటట్టుగా మోర వాల్చుకుని పరుగెత్తుతుండడం మెరుపుకాంతిలో కనిపించింది. దాని దారికడ్డంగా మరి రెండు క్రోసుల దూరాన ఒక అగాధమైన లోయ ఉండడం ముసలివానికి గుర్తుకొచ్చింది. అతడు మరింత వేగంగా పరుగెత్తి దాన్ని కలుసుకున్నాడు. ఆర్తనాదియై పరుగెడుతున్న ఎనుబోతును రెండు హస్తాలతో ఆపడం అతనితరం కావడంలేదు. అది







తపతపమని అడుగులు వేసుకుంటూ వర్షపునీటిని చెదరగొడుతూ, బుసకొడుతూ, నోటి అంచువద్ద నురగ కార్చుతూ పరుగిడుతూంది. అతడు దాని పక్కగా కొంతసేపు పరుగెత్తి అదనుచూసి దాని ముందుకాలి మోకాలు వెనక పుష్టిగ కొద్ది తన్నాడు. ఆ తాపుకు దానికాలు వంగి అది దభేలుమని ముందుకు పడిపోయింది. అతడు క్షణమాలస్యం చేయకుండా దానిమీద పడి ముక్కు దాడులో చేయివేసి దానిని అదుపులోకి తెచ్చాడు.

నలభై ఏండ్ల క్రితం జరిగిన ఆ ఉదంతాన్ని నెమరువేసుకుంటూ ముసలివాడు, నడుస్తున్నాడు.

"నేను అనుభవాన్ని ఎందుకు మననం చేసుకున్నాను?" అని అతడు తనను తాను ప్రశ్నించుకున్నాడు. అతడా విషయాన్ని ప్రయత్నపూర్వకంగా మననం చేసుకోలేదు. అది అసంకల్పితంగా జరిగింది. అది సత్ఫలితాన్నే యిచ్చింది. ఇప్పుడతనికి తన అనుభవాలమీద, యుక్తులమీద, శరీర పటిష్టత మీద నమ్మిక కుదిరింది. అతని మనసులో పొడ సూపిన నిరాశ మాయమయింది.

'ఈ ఉదంతాన్ని మళ్ళీ మననం చేసుకుంటాను. చిన్న చిన్న వివరాలను సైతం వదలకుండా తవ్వి తిరగేసి మళ్ళి మళ్ళీ మననం చేసుకుంటాను' అనుకున్నాడతడు.

## 7

అతడు హూచ్ హూచ్ అని అరుస్తూ బలసతుప్పలమీదుగా, కాసేరాకు పొదలమీద నడుస్తున్నాడు. బండలవంటి అతని పాదాలను బలస ముండ్లు బాధించడంలేదు. కాసేరాకు దురద కలిగించడంలేదు.

బలసతుప్పల కవతల గురివెంద పొద ఒకటి అతనికి కనిపించింది. కాయలు పండి పగిలి ఎర్రని గింజలు వెన్నెలలో కనిపిస్తున్నాయి. దూరంనుండి ముసలివాడు పొదలోకి రాళ్ళు విసిరాడు. పొద అటు యిటు ఊగింది. అతడు దాపుగా వెళ్ళి ఈటెతో పొదమీద బాదాడు. నల్లటి మచ్చలుగల ఎర్రని గింజలు జల్లుజల్లుమని కిందకు రాలాయి. రెండు కుందేళ్ళు పొదలోనుండి చివుక్కుమని బయటకు దూకి చెంగు చెంగుమని ఎగురుతూ పారిపోయాయి. ముసలివాడు కనుమరుగయేవరకు వాటిని చూసి, 'అరి మొగుడు. పాపం సరసాలాడుతూ ఉండినట్టున్నాయి.' అనుకున్నాడు.

## అతడు అడవిని జయించాడు

మరొక పొదలోనుండి పూరేడుపిట్ట కూస్తుండడం అతడు విన్నాడు. అది తన గుడ్లమీద కూర్చుని పొదుగుతూ, తుర్ర్రని అవిరామంగా కూస్తున్నది. 'ఆ పొదను వెదక నవసరంలేదు. ఆ పొదలో పంది లేనట్టే. ఉంటే పూరేడు అలా జంకుగొంకు లేకుండా కూస్తూ అక్కడ పడుకునేది కాదు.' అనుకున్నాడతడు.

మరొక బొంతజెముడు పొదలోనుండి బుస్సు బుస్సుమని చప్పుడు వినిపిస్తూ ఉంది. పొదలోపల ఒక రాతికేసి తలను రాపాడుతూ ఒక పాము తన కుబుసాన్ని వదలడానికి ప్రయత్నిస్తూంది. ముసలివాడు పాము బుసనువింటూ పొదదాపున కొంతసేపు నిలబడి మళ్ళీ నడవడం ప్రారంభించాడు. పొదలోపల మెలికలు తిరుగుతూ, దొర్లుతూ, నేలమీది దుమ్ము పైకి లేచేట్టుగ బుసకొడుతూ కుబుసాన్ని వదలడానికి ప్రయత్నిస్తున్న పామును తలుచుకుంటూ అతడు నడుస్తున్నాడు.

దారి పక్కన అతనికొక ముంగిస కనబడింది. అది గడ్డి ధాన్యాన్ని ఏరుకుని తింటూ ఉంది. దాన్ని చూడగానే ముసలివాడు 'దీనికి నూరేళ్లాయుసు' అనుకుని దాని నుద్దేశించి "ఈ గడ్డిత్తులు రాతిరంతా తిన్నా నీ పొట్ట నిండదు. బొంత జెముడు పొదలో కట్లపాము పెనుగులాడ్తా ఉండాది. పోయి దాన్ని తుండెమిట్ల, మొండెమట్ల తెగేసి తినేయ్" అన్నాడు. ముంగిసకు అతని మాటలు అర్థం కాలేదు. అది మీసాలను ఆడించుకుంటూ మెడ రిక్కరించి కొంతసేపు చూసి గబుక్కున వెనుదిరిగి పరుగెత్తి చెట్టు తొర్రలోకి మాయమై పోయింది.

అతడొక చదును ప్రదేశం మీద నడుస్తున్నాడు. ఇక్కడి గడ్డి స్వల్పంగా మొలిచి ఉంది. పొదలు దూర దూరంగా ఉన్నాయి.

'నాకు గూడా ఆకలవుతూంది' అనుకున్నాడు ముసలివాడు. అతడు తాగిన కల్లు పూర్తిగా ఆవిరి అయిపోయింది. మైకం దిగి చాలసేపయింది. కడుపులో ప్రేవులు రావిడి చేస్తుండడం అతనికి వినిపిస్తూంది.

'గురివెంద పొదలో నుండి బయటకు దూకిన కుందేళ్లలో ఒకదాన్ని నేను చంపి తిని ఉండాల్సింది' అనుకున్నాడు ముసలివాడు. అలా చేయనందుకు అతడు తనను తాను కాసేపు నిందించుకున్నాడు. 'మరి అప్పట్లో నాకు ఆకలి లేదాయె. పైగా ఆ కుందేళ్లు జంటగా ఉండె — జంటను విడదీయడం మహాపాపం' అని అతడు సంజాయిషీ చెప్పుకున్నాడు.

'ఇప్పుడు మాత్రం మునిగిపోయిందేముంది. ఈ అడవిలో కుందేళ్లు దండిగా ఉంటాయి. నా చేతిలో ఈటె ఉంది. తలలో నానా యుక్తులున్నాయి. నేను దేనికీ వగచాల్సిన పనిలేదు" అనుకున్నాడతడు.

అతడు నడుం వంచి వెన్నెలలో కుందేళ్ళ అడుగుజాడల కోసం వెదకసాగాడు. గడ్డి తక్కువగా మొలిచి ఉన్నందువల్ల దుమ్ములో అసంఖ్యాకమైన అడుగులు కనిపిస్తున్నాయి. కొంతసేపటికి అతడు కుందేలు పాదాలను గుర్తించగలిగాడు. వంచిన నడుమెత్తకుండా అతడా అడుగులను వెంబడించి నడవసాగాడు. అలా కొంత దూరం పోయాక ఆ అడుగులు వంకర టింకరగా రెండు బారలు సాగి అదృశ్యమైపోయాయి. 'అది దాక్కుని ఉన్న పొద ఈ దాపులోనే ఉండాలి' అనుకుంటూ ముసలివాడు నడుమెత్తి నిలుచున్నాడు.

తను నివాసముండే పొదను సమీపించినపుడు కుందేలు ఉద్దేశపూర్వకంగా యిలా వంకర టింకరగా

### కేన్సరుకి "ఇంటర్‌ల్యూకెన్-2"!

జపానులోని అజికొమోటో కంపెనీ, కేన్సరు పరిశోధనాసంస్థ సంయుక్తంగా కొత్త కేన్సరు ఔషధం "ఇంటర్ ల్యూకెన్ 2"ను తయారుచేసినట్లు ప్రకటించాయి. దీనిని "టి" కణాల నుండి తయారు చేశారు. ఇవి ఒకరకమైన లింఫోసైట్ కణాలు. ఈ కొత్త ఔషధం అమితంగా వ్యాధి నిరోధక శక్తిని కలిగించగలదని భావిస్తున్నారు. ఇంటర్‌ఫెరాను ఔషధాన్ని సర్వరోగ నివారణిగా భావిస్తున్నారు. అయితే దీని నుండి ఎదురు చూసిన ఫలితాలు ఇంకా లభించలేదు. ఈ కొత్త ఔషధంతో కూడా సమగ్రమైన పరీక్షలు ఇంకా నిర్వహించలేదు. ఇది బహు కొద్ది మొత్తాలలో మాత్రమే తయారుచేయటానికి వీలయింది.

# తలనొప్పికోసం ఎన్నో వాడి చూశాను

—ఫిల్మ్ హీరో.

కడకు విలన్ని వదిలి
నాతలపైనే కరాటే
దెబ్బలేసుకున్నా!

**అయితే నిజంగా పనిచేసేది ఒక్కటే!**

## సారిడన్

ట్రేడ్ మార్కు 'రోష్'




శక్తివంతమైనది, సురక్షితమైనది. ఒక్కటి వేసుకుంటే చాలు.

HTB-RPL-9321

నడుస్తుంది. అలా చేయడం ద్వారా అది తనను వేటాడే జంతువులను తప్పదారి పట్టిస్తుంది. 'నన్ను తప్పదారి పట్టించడం దాని తరంగాదు. దానబ్బతరము కాదు' అనుకున్నాడు ముసలివాడు.

దావుననే ఒక చిట్టీత పొద ఉంది. ముసలివాడు బొడ్లోని కత్తిని చేతిలోకి తీసుకుని అక్కడున్న తుమ్మ కంపలను, బలస కంపలను కొట్టి తెచ్చి చిట్టీత పొద చుట్టూ మూడువైపుల నడుమెత్తు కంచె వేశాడు.

'పరుగులో కుందేలును మించిన జీవం లేదు. నువ్వు ఉమిసిన ఎంగిలి ఆరేలోగా అది ఈ అడవిని రెండుసార్లు ప్రదక్షిణ చేసేస్తుంది. పోతే దారి కడ్డంగా మూరెడు కంచె అడ్డమొస్తే అది మరి ముందుకు సాగదు. మోకాలును నాకుకుంటూ కూర్చుంటుంది' అనుకున్నాడు ముసలివాడు.

అతడు చిట్టీత పొదకు మూడు వైపులా కంచె వేయడం ముగించి నాలుగో వైపున నిలుచున్నాడు. ఈటెను కుడిచేతిలో సిద్ధంగా పట్టుకుని పెద్దగా గొంతుపెంచి హాహా హూహూ అని అరుస్తూ పొదలోని కుందేలుకు గంగవెర్రులెత్తించడం ప్రారంభించాడు. పొదలోనుండి ఏ ప్రాణీ బయటకు రాకపోవడంతో మరింత గట్టిగా అరుస్తూ నోరు లబలబ బాదుకుంటూ భీభత్సం సృష్టించాడు. దాంతో కుందేలు పొదలోనుండి బయటకు చెంగున దూకి మూడు వైపుల కంచె ఉండడం గమనించి మరింతగా బిత్తరపోతూ నాలుగోవైపుగా పరుగెత్తసాగింది. ఇంతలో ముసలివాని ఈటె దాని ఎదలో దిగింది. అది కీచుమని అరుస్తూ ఎగిరి నాలుగు బారల కవతలపడి విలవిల తన్నుకోసాగింది.

'ఈ రోజు నువ్వు ఎడంప్రక్కన నిద్రలేచావు'

# అతడు అడవిని జయించాడు

అనుకుంటూ అతడు విలవిల తన్నుకుంటున్న ప్రాణి చెంతకు నడిచాడు. అదిప్పుడు విలవిలలాడడంలేదు. దాని శరీరం నుండి కారిన నెత్తురు వెన్నెలలో నిగనిగ మెరుస్తున్నది. ఈటె దాని శరీరానికి గుచ్చుకుని ఇంకా అలాగే వున్నది. ముసలివాడు ఈటెను ఎత్తి భుజాన వేసుకుని, ఈటె చివరన కుందేలు మూటవలె వ్రేలాడుతుండగా నడవసాగాడు.

అతడొక బూరుగ చెట్టుకింద కుందేలును దించిపెట్టాడు. చెట్టుకింద బూరుగ కాయలు చెల్లాచెదరుగా పడి ఉన్నాయి. కొన్ని కాయలు పొట్ట విచ్చుకుని ఉండగా లోపల ఉన్న బూరుగ దూది తెల్లగా కనిపిస్తున్నది. అతడొక కాయనుతీసి దూదిని బయటకు తీసి తన బలమైన అరచేతుల మధ్య నలిపాడు. రెండు కణిక రాళ్ళను ఒకదాని మీదొకటి కొట్టి నిప్పు పుట్టించి దూదిని రగిలించాడు. దావున ఉన్న ఎండు పుల్లలను ఏరి తెచ్చి పెద్ద మంట తయారుచేశాడు. ఈటెను బయటకు లాగివేసి కుందేలును మంటలో పడవేశాడు. మంట తగ్గకుండా పుల్లలను వేస్తూ, కుందేలును అటూ ఇటూ దొర్లిస్తూ అతడు మంట ప్రక్కనే కూర్చున్నాడు. చూస్తుండగానే దాని బొచ్చంతా కాలిపోయింది. కండలు చమురు కమ్ముతూ కమ్మని వాసన వెదజల్లుతూ కాలసాగాయి. బాగ పచన మయ్యాక అతడు దానిని మంటనుండి బయటకు తీసి బయటపడేశాడు. కత్తితో దాని కండలను ముక్కలు ముక్కలుగ కోశాడు. తను తలకు చుట్టుకుని ఉండిన గుడ్డను విప్పి నేలమీద పరచి మాంసపు ముక్కలను దానిమీద పోశాడు.

అతనికి అల్లంత దూరాన కిచ్చిలి చెట్టు కనిపించింది. దాని కాయలు గాలికి ఊగుతూ కొమ్మలనుండి వ్రేలాడుతున్నాయి. ముసలివాడు లేచి వెళ్ళి రాళ్ళతో కొన్ని కాయలు పడగొట్టి తెచ్చాడు. కాయలను బద్దలుగా కోసి మాంసపు ముక్కలమీద పిండాడు. పుల్లటి కిచ్చిలి రసంతో తడిసిన మాంసపు ముక్కలను బూడిదలో అద్దుకుని అతడు తినసాగాడు.

పుల్లల మంట క్రమక్రమంగా తగ్గిపోయింది బూడిద కింద ఉన్న నిప్పులు గాలి వీచినప్పుడల్లా తమ ఉనికిని బయటకు కనబరుస్తున్నాయి.

అతడు ఆవురావురుమని తింటున్నాడు. ఎముకలను పక్కకు గిరవాటు పెడుతున్నాడు.

కొంతసేపటికి మంట అణగారిపోయినట్టు అతని ఆకలి తగ్గిపోయింది. తుండుగుడ్డ మీద ఇంకా దోసెడు మాంసపు ముక్కలు మిగిలి ఉన్నాయి కొన్ని కిచ్చిలికాయలు గూడా మిగిలి ఉన్నాయి. వాటినన్నిటిని అతడు మూటగట్టాడు. పైకిలేచి అరచేతులను రోమమయమై ఉన్న తన తొడలకు తుడుచుకున్నాడు. మూటను ఈటె చివరన వ్రేలాడ గట్టుకుని, ఈటెను భుజాన వేసుకుని నడవసాగాడు.

పల్లు కుట్టుకుంటూ ఏ చెట్టుకిందయినా కాసేపు కూచోవాలనుందతనికి. 'ఇది సమయంకాదు. నుక్కపందిని ఎప్పుడు కండ్లజూస్తానో! అందాక నాకు విశ్రాంతిలేదు. పైగా ఇప్పుడు నేను సుష్టుగా భోంచేసి శక్తిని పుంజుకుని ఉన్నాను. కొంతసేపటికి మళ్లీ ఆకలి ప్రారంభంకావచ్చు. రాత్రి గడిచేకొద్ది నిద్రముంచుకురావచ్చు. లేక మరేదైనాజరిగినా కర్తవ్య నిర్వహణకు అంతరాయం కలుగవచ్చు.' అనుకున్నాడతడు.

(ఇంకా వుంది)



## బాటరీ మోటార్ సైకిల్!

కర్ణాటక రాష్ట్రంలో విద్యుత్ మోటారు సైకిలొకటి నిర్మించారట మేధావులు. ఈ మోటారుసైకిలు ఖరీదు ఏడువేల అయిదు వందలు అట. 24 వోల్టుల బ్యాటరీతో పనిచేసే యీ బండి 35 కిలోమీటర్ల వేగంతో పరుగిడ గలదట. విద్యుత్ ఖర్చు కిలోమీటరుకు అయిదు పైసలట. 40 వేల కిలోమీటర్లు అయ్యాక యీ బ్యాటరీని మార్చెయ్యాలిట. బ్యాటరీ చార్జి చేశాక సుమారు 80 కిలోమీటర్ల వరకూ ఏకబిగిన పోవచ్చునట.

## ఉత్తరాల బట్వాడా !

బారతదేశంలో ఒక రోజుకు సుమారు 1100 కోట్ల వుత్తరాలు దేశం నలుమూలలా తంతి తపాలా శాఖవారు బట్వాటా చేస్తున్నారట. అనగా నెలకు 33000 కోట్ల వుత్తరాల బట్వాటాఅన్నమాట. అనగా ఏటికి...వొద్దులెండి.

*  *  *

చింతపల్లికి చెందిన రాఘవేంద్రనగర్, రామగిడ్డ అనే గ్రామాలకు మధ్య ప్రాంతంలో వున్న వో కాఫీ హోటలుమీద వో పులి గాండ్రించి ఎగిరి గంతేసి చేసిన దాడిలో వో పదహారేళ్ళ కుర్రాడు చచ్చిపోయాడట. మరొకతన్ని ఆ పులి తీవ్రంగా గాయపరచిందట— అక్కడికి పులులు కాఫీ కొస్తాయో, ఏమో !

## హత్యకి దారితీసిన ఆవేశం !

చెంగల్పట్టుకు 8 కిలోమీటర్ల దూరంలో వున్న తిమ్మాపురం అనే వూరుకు చెందిన 26 ఏళ్ళ దేవేంద్రన్, 25 ఏళ్ళ తిరునావక్కర్సు అనే యిద్దరు స్నేహితులో సారాబుడ్డి చేతో పుచ్చుకుని రైల్వే లైను పక్కనుంచి నడిచి పోతూపోతూ దారిలో ఎండకు ఆరబోసిన వేరు శనక్కాయల్లో కొన్నిటిని ఏరుకు తీసుకున్నారట. వాటికి కాపలావున్న ఆదికేశన్ అనే వ్యక్తి వాన్ని ఆపి, మీకు బుద్ధుందా అంటూ తిట్టేసరికది తన్నులాటయిందట. దాంతో ఆదికేశన్ వారి చేతిలోవున్న సారాసీసా లాక్కుని, పగలగొట్టి, దాంతో వారిద్దరి పొట్టలోనూ పొడిచి, చంపేశాడట !

## డాన్స్ హాలులో అగ్నిప్రమాదం !

సౌత్ కొరియాకు చెందిన తేగు అనే నగరంలోని వో డ్యాన్సు హాలులో 18వ తేదీన ఆనందానందాలతో ఆడా మగా వయస్సులో వున్న పిల్లలు డ్యాన్సులు వుల్లాసంగా చేసుకుంటూండగా వున్నట్టుండి రెండో అంతస్తులో వున్న ఆ హాలులో మంటలు పుట్టాయట. ఆ మంటలో పడి 24 మంది కాలి బూడిదైపోయారట. 70 మంది భయంకరంగా గాయపడ్డారట. మొత్తం 410 మంది అక్కడ ఆ టైముకు డ్యాన్సు చేస్తూ వున్నారట.

## సి. బి. ఐ.ని తికమక పెట్టిన అభినవ చాణుక్యుడు !

ఉత్తర భారతదేశానికి చెందిన గాంధినగర్ అనే నగరంలోని స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాలో సాదా గుమాస్తాగా పనిచేస్తున్న కీర్తి ఆచార్య అనే వో అభినవ చాణక్యుడు తన బ్యాంకును మోసగించి, కొన్ని అత్యంత అద్భుత పథకాల ద్వారా మొత్తం నాలుగు వందల లక్షల రూపాయలు సంపాదించాడట. సి. బి. ఐ. ఈ మొత్తం చెప్తే బ్యాంకు అధికారులు పోయిన మొత్తం డబ్బు తొమ్మిదివందల లక్షలు పోయి వుంటాయని అంటున్నారట. క్లర్కుగా వున్న ఆచార్య వారి కళ్ల ఎదుటే కార్లలో తిరిగినా, ఎయిర్‌కండిషను హోటళ్లలో వుంటున్నా, సినిమా డిస్ట్రిబ్యూషను అధిపతి అయినా, నిర్మాత అయినా, సినిమాహాళ్ల వోనరు అయినా, హవుసింగ్‌బోర్డు కాలనీలు కట్టి అమ్ముతున్నా ఎవరూ అనుమానించ లేదట. తనకు సహాయం చేసిన వో ప్యూనుకు ఆతడు ఫియట్ పద్మిని మోడలు కారు బహూక రించాడట. ఈనాడా ఆచార్యను అరెస్టు చేయలేక సి. బి. ఐ. బుర్ర పట్టుకుని కూర్చున్నదట—లేనిది పట్టుకుంటే ఏంలాభం !

## ముద్దు ముచ్చట !

ఏ పని చేసినా అది అంతకు ముందు ఎవరూ చేయనంతగా చేస్తే అది లోకం మెచ్చే విషయమై కూర్చుంటుంది. అమెరికాలో వో ప్రేమికుల జంట ప్రపంచం ఆశ్చర్యపోయేలా ముద్దు పెట్టుకున్నారట. చుప్పన ముద్దు పేర కలుసుకున్న వీరి రెండు రెళ్ల నాలుగు పెదవులూ ఏకబిగిన ఆరు రోజులు అదే స్థితిలో వున్నాయట. అయితే యీ జంట ప్రతి రెండేసి, మూడేసి గంటల కొక్కసారి తమ ముద్దును వో రెణ్ణిముషాలు నిలిపి, పెదిమలకు వెజలీను రాసుకున్నారట. ఆహా వీరిదెంత ముద్దయిన జంట అని ప్రపంచం ఆశ్చర్యపోతే మరింత ముద్దుగా కూడా వుండగలమన్నారట. 






## "డాక్టర్, మాకు ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ, కాని..."

దిలీప్, రజని ఎంతో బెంగతో తమ కుటుంబ డాక్టర్‌ని కలుసుకున్నారు. "మేము బహుశ ఒకరికొకరం తగమనుకుంటాం డాక్టర్" అని, తన విచారాన్ని కప్పిపుచ్చుకుంటూ అన్నాడు దిలీప్. డాక్టరుగారు నెమ్మదిగా ప్రశ్నించి రజని సమస్య తెలుసుకున్నారు. విషయం ఏమిటంటే, ఆమె జననాంగం లోపల పొడిగా వుండటం వల్ల వారి దాంపత్య సంబంధానికి ఇబ్బంది కలుగుతోంది. డాక్టర్ ఇలా చెప్పారు. ఇటీవలి వరకూ ఈ అవసరానికి తగిన సాధనమేదీ ఉండేది కాదు. కాని అదృష్టవశాత్తూ ఇప్పుడు జాన్సన్ అండ్ జాన్సన్ కంపెనీ—ఈ కంపెనీ పిల్లల సంరక్షణ ఉత్పత్తులకు పేరు పొందిన కంపెనీ— ఒక ఉత్పత్తిని తయారుచేసింది. దాని పేరు కె-వై* జెల్లీ. ప్రత్యేకంగా తయారైన ఈ జెల్లీ స్వచ్ఛమైనది, తేలికగా వుండే జారుడునిచ్చేది, అచ్చం శరీరపు సహజమైన జారుడు ద్రవం లాగా ఉంటుంది. అంతేకాదు. ఇది నీటిలో కరిగిపోతుంది, పట్టుకొని కాని, జిడ్డుగా కాని ఉండదు. దీన్ని ఎంతో అనువుగా ఉపయోగించవచ్చు, సులభంగా కడిగేసుకోవచ్చు.

డాక్టర్ ఇంకా ఇలా అన్నారు. కె-వై* జెల్లీ క్రిములు లేనిది. దీని పి. హెచ్. స్థాయి (ఆమ్ల, క్షార నిష్పత్తి) మనుష్య చర్మానికి అనుగుణంగా ఉంటుంది. అంచేత, ఇది పూర్తిగా సురక్షితమైనది. దీన్ని భార్యా భర్తల్లో ఎవరైనా ఉపయోగించవచ్చు. కె-వై* జెల్లీ రాసుకోగానే, పొడిదనం పోయి మృదుత్వం వస్తుంది. ఈ జెల్లీ ఒక పల్చని పొరలాగా ఏర్పడి. సున్నితమైన చర్మాన్ని ఒరిపిడి నుంచి కాపాడుతుంది అని వివరించారు డాక్టర్. కొంతకాలం తర్వాత వారికి కె-వై* జెల్లీ ఉపయోగించవలసిన అవసరం ఉండకపోవచ్చు. అయినప్పటికీ దాంపత్య సంబంధం సంతృప్తినిచ్చేందుకు ఒక జారుడు పదార్థంగా ఈ జెల్లీని వారు ఉపయోగించడం మంచిది అని సలహా ఇచ్చారాయన.

దిలీప్, రజనిల బెంగ తీరింది. కాని వారికో అనుమానం వచ్చింది. "....మాకు పిల్లలు పుట్టడానికి ఇది ఆటంకం కలిగించదా డాక్టర్" అని అడిగారు. ఆరోగ్యమైన, చక్కని బిడ్డల్ని కనడానికి కె-వై* జెల్లీ ఎటువంటి ఆటంకం కలిగించదు అని చెప్పారు డాక్టర్.

తేలికైన మనసులతో సెలవు పుచ్చుకున్నారు ఆ దంపతులు. ఇంకొక వైవాహిక జీవితం ఇప్పుడు సుఖప్రదం కాబోతోంది.

# "డాక్టర్ మాకు ఒకరంటే ఒకరికి ఎంతో ప్రేమ, కాని..."






# కె-వై* జెల్లీ

ప్రపంచమంతటా దంపతులకోసం
డాక్టర్లు సిఫారసు చేసినది.

Johnson & Johnson



LINTAS J & J 3-2333 TI



# సినిమా విశేషాలు

-జి. వి. జి.

## "మగ మహారాజు"లో కుమార రత్నం

బామ్మ (నిర్మలం) దగ్గర చాపమీద కూర్చుంటూ రాఘవయ్య (ఉదయకుమార్) "అమ్మా! మన సావిత్రికి ఈ నెల్లో కట్నం ఇచ్చి పంపిద్దామనుకుంటున్నాను. సరస్వతి పెళ్లి కూడా వచ్చేనెల్లో జరపాలని ప్రావిడెంట్ ఫండ్ లోన్‌కు అప్లయ్‌చేశాను. కాని, అనుకున్న దాంట్లో సగమే అందింది ... నేను డబ్బు కోసం ఎంత ఇబ్బంది పడినా— ఏ నాడూ ఏదీ నిన్ను అడగలేదు. కాని. అన్నమాట నిలబెట్టుకోవడం కోసం అడక్క తప్పడంలేదు. ఒక్కసారి నీ మెడలో ఉన్న ఆ గొలుసిస్తే ... దాన్ని తాకట్టు పెడితే, రెండు బాధ్యతలూ తీర్చేసిన వాడ్నవుతాను," అన్నాడు.

"నీ నాన్నుడి వ్యవహారం చూసినప్పుడే ఇలాంటి పితలాటకం ఏదో తీసుకొచ్చి పెడతావనుకున్నాను. ఆ మహారాజు పోయాక పుస్తెలు వెడగొట్టి చేయించుకున్నానీ గొలుసు. ఇప్పుడు దీన్ని కాస్తా హారాయింపు చేస్తానంటావా? ఒరేయ్! ఆ మాట అనడానికి నీకు నోరెలా వచ్చిందిరా?" అంది బామ్మ.

"ఈ రెండు బాధ్యతలూ, తీరిపోతే, డబ్బు రాగానే విడిపించేస్తాను కదా?"

"ఆఁ...విడిపించిస్తావ్! తోడబుట్టిన చెల్లెలికి కట్నం ఇచ్చి పంపించలేక చుక్కలు లెక్కపెడుతున్న వాడివి — నా గొలుసు విడిపించి ఇస్తానంటే నేను నమ్ముతానేం? బంగారం మీద మోజుతో కాదురా ఈ గొలుసు వేసుకు తిరుగుతున్నది! మహారాజులాగా బతికిన మీ నాన్న శ్రాద్ధం ఎంత ఘనంగా పెట్టావో నేనింకా మర్చిపోలేదురా! రేపు నేను చస్తే, నన్నింత బుగ్గి చేయడానికి నువ్వు నలుగుర్ని చందాలెత్తకుండా ఉండడం కోసమేరా నా దగ్గర ఈ కాస్త బంగారం ఉంచుకుంది."

"అది కాదమ్మా!"

"నువ్వేం మాట్లాడకు. నాకు ఇహంకన్నా పరం ముఖ్యం. బతుకు కన్నా చావు ముఖ్యం. ఇంకెప్పుడూ నా గొలుసుకీ— మీ అవసరాలకీ మాత్రం లంకె పెట్టకు. వెళ్లు!"

కుంగిపోయిన రాఘవయ్య అక్కడ మరో క్షణం ఉండలేక చివాలున లేచి వెళ్లిపోయాడు.

మాగంటి రవీంద్రనాథ్ చౌదరి నిర్మించిన శ్యాంప్రసాద్ ఆర్ట్స్ "మగ మహారాజు" చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం : విజయబాపినీడు.



'మగ మహారాజు'లో రోహిణి, తులసి

## సిలోన్‌లో నవశక్తి పిక్చర్స్ చిత్రం

"మా సంస్థ తొలి చిత్రం 1958లో 'మా ఇంటి మహాలక్ష్మి'. ఇప్పుడు రజతోత్సవం కానుకగా మా 21వ చిత్రాన్ని శ్రీలంకలో తయారుచేస్తున్నాం" అన్నారు నిర్మాత పర్వతనేని నారాయణరావు. కృష్ణంరాజు, శరత్‌బాబు, రాధిక, సింహళ తారలు, నవత్ గుణతిలకె, మాలినీ ఫోన్సెకా ప్రధాన పాత్రధారులు. రాజభరత్ కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు. శంకర్‌గణేశ్ సంగీత దర్శకులు. సిలోన్‌లో జూన్ 15 నుంచి జూలై 15 వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ ముగుస్తుంది



జయసుధ, మురళీమోహన్
'కురుక్షేత్రంలో సీత'లో

## మోహన్‌బాబు కొత్త చిత్రాలపేర్లు

మోహన్‌బాబు, సుమలత నాయకా నాయికలుగా జి. పి. శేఖర్ స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో అడుసుమిల్లి లక్ష్మీకుమార్ నిర్మించే విశ్వప్రశాంత్ మూవీస్ చిత్రం పేరు "నరో మొనగాడు" ఈ చిత్రానికి ప్రముఖ తమిళ రచయిత 'మారా' కథకుడు. సత్యానంద్ సంభాషణలకర్త, చక్రవర్తి సంగీత దర్శకుడు పుష్పాల గోపీకృష్ణ ఛాయాగ్రాహకుడు.

మోహన్‌బాబు, కవిత నాయకా నాయికలుగా బోయిన సుబ్బారావు దర్శకత్వంలో ఎ.ఎల్. అబ్బాయి నాయుడు నిర్మించే మధు ఆర్ట్ ఫిలిమ్స్ "మూగవాడి పగ" చిత్రానికి ఎం డి. సుందర్ కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చారు. సత్యానంద్ సంభాషణలకర్త, సత్యం స్వరకల్పనలో ఆత్రేయ గీతాలు రాశారు పుష్పాల గోపీకృష్ణ ఛాయ, వి. రవి కూర్పు, కుదరవల్లి నాగేశ్వరరావు శిల్పం, ఎన్. గోపాల్ సహ దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

# సినిమా

## "సమాజంలో స్త్రీ"లో ఉద్యోగంలో స్త్రీ

మనోరంజని సోప్ ఫాక్టరీ అధినేత బాల సుందరరావు (రావుగోపాలరావు.) ఆయన ఏకైక పుత్రుడు రాజా (భానుచందర్) ఆ ఫాక్టరీ జెనరల్ మేనేజరు. ఉద్యోగానికి వచ్చే ఆడపిల్లల్ని తన వైపుకు ఎలా ఆకర్షించుకోవడమా అని తాపత్రయపడే తండ్రిని కుమారరత్నం అడుగిడుగునా అడ్డగిస్తూ, తండ్రి వరస కలపకముందే తన వలలో వేసుకోవాలనే దురాలోచన, దూరాలోచన కలవాడు. ఇంతటి విపరీత ప్రవృత్తులుగల తండ్రి కొడుకుల ఫాక్టరీలో కరుణ (విజయ శాంతి) అనే అభాగిని స్టెనో.

కరుణ కనిపిస్తేచాలు — ఏదో నెపంతో ఆమెను పిలిచి మాట్లాడాలని, ఆమె మనసును పసికట్టాలని రాజా తంటాలు పడుతూంటాడు.

ఒకరోజు కరుణను పిలిచాడు. "హలో, మిస్ కరుణా! అర్జంట్‌గా ఓ లెటరు టైప్ చెయ్యాలి... బై ది బై, మిస్ కరుణా! మీకు పెళ్ళయిందా ?" అని ప్రశ్నించిన రాజా. ఆమె ముఖం తెల్లబోవడం గమనించి, "అపార్థం చేసుకోకండి. ఈ రోజుల్లో ఉద్యోగాలు చేయడానికి వచ్చే చాలామంది ఆడవాళ్ళు తమ మంగళ సూత్రాలను కనిపించకుండా జాగ్రత్తపడుతూంటారు. సో... ఎవరు మేరీడ్ — ఎవరు అన్



'త్రివేణి సంగమం'లో వనితశ్రీ

మేరీడ్ తెలుసుకోవడం కష్టంగా ఉంటుంది అందుకే అడిగాను... బై ది బై.. మీరు సినిమాలు చూస్తారా ?" అడిగాడు.

"లేదండి," అంది కరుణ ముక్తసరిగా.

"సినిమాల్లో కేవలం వినోదమే కాదండి విజ్ఞానంకూడా ఉంది. 'గుప్తజ్ఞాన్' సినిమా చూశారా ? ఇటీస్ ఎన్ ఎడ్యుకేషన్ మూవీ..." అని రాజా వాగుతున్నవాడల్లా శాంతి పెడచెవిని పెట్టినట్టుందని గుర్తించి, నిరాశతో ఏదో లెటర్‌ను డిక్టేట్ చేయనారంభించాడు.

చిత్రీకరణ ముగిశాక డైరెక్టర్ ఎం. ఆర్ కృష్ణ "ఇలాంటి ప్రశ్నలెన్నో! పరీక్షలెన్నో! తప్పనిసరి పరిస్థితులలో ఉద్యోగానికి వచ్చి, ఇలాంటి విషవలయంలో చిక్కుకుని, ఎలా బయటపడాలో దిక్కుతోచని స్త్రీలకు మా 'సమాజంలో స్త్రీ' చిత్రంలోని కరుణ కథ ఓ చక్కని సమాధానం," అన్నారు. ప్రముఖ తమిళ దర్శకుడు దురై కథ, స్క్రీన్‌ప్లే సమకూర్చిన కశ్యప్ గ్రూప్ క్రియేషన్స్‌వారి ఈ చిత్రానికి డి కశ్యప్ నిర్మాత

## "కళాపిపాసి"

"జూన్ రెండవ వారంలో అనంతపురం పరిసరాలలో షూటింగ్ ప్రారంభించి, ఒకే షెడ్యూల్లో పూర్తిచేస్తాం," అన్నారు గోన విజయరత్నం. ఈయన కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, పాటలు, దర్శకత్వంలో కడప వాస్తవ్యులు వి.జె. చంద్రశేఖర్ నిర్మించే చంద్రశ్రీ ఫిలిమ్స్ "కళాపిపాసి" చిత్రానికి మే చివరి వారంలో పాటల రికార్డు చేయబడతాయి.

"తీసిన సినిమా ఫెయిలవటంతో విరక్తి చెందాడు!"



# అన్ని పనులు మీరు చేస్తారు మిమ్మల్ని ఎవరు చూస్తారు ?

పిల్లలు బడికి వెళ్ళారు. ఉదయం టిఫిన్ పూర్తవుతుంది. ఇక మీరు ప్రతిరోజూ చేసే పనులు ప్రారంభమవుతాయి.

అవి అలాగే కొనసాగుతాయి. పనులలో మునిగిపోతారు. ఉతకడం. ఇస్త్రీచేయడం. వంటచేయడం. కుట్టడం.

అప్పుడు ఒక కప్పు హార్లిక్స్ త్రాగితే ప్రాణం లేచి వస్తుంది.

ప్రతి రోజూ హార్లిక్స్ త్రాగడం ఆరోగ్యానికి సూచన. అందుకే లక్షలాది మంది 100 సంవత్సరాలకు పైగా హార్లిక్స్ విలువని విశ్వసించారు. ప్రపంచమంతటా డాక్టర్లు హార్లిక్స్ ఆరోగ్యానికి తగినదని సిఫార్సు చేశారు.

ఆశ్చర్యం లేదు. హార్లిక్స్‌లోని విలువైన, స్వచ్ఛమైన మూలపదార్థాలని వాటి విలువని కాపాడుకునేటట్లు, సులభంగా జీర్ణమయేటట్లు కలిపారు.

హార్లిక్స్ త్రాగటం మీ కుటుంబ జీవనంలో ఒక భాగంగా చేయండి. మీ జీవితంలోనూ ఒక భాగంగా చేసుకోండి.




మంచి పుష్టికరమైనది

HTD-HMM-7537

## సినిమా



'బహాదూరపు బాటసారి'లో రాజమోహన్, భానుచందర్, సుమలత, మల్లికార్జునరావు

### "శివుడు....శివుడు....శివుడు"

"ప్రతి వ్యక్తిలోనూ అజ్ఞాతంగా ఆత్మశక్తి ఉంటుంది. ఆ శక్తిని ఆత్మప్రభావితంతో పెంపొందించుకోగలిగితే, ఆ వ్యక్తికి ఎదురు లేదు; ఆ శక్తికి తిరుగుండదు. ఈ సందేశమే మూలకథావస్తువు," అన్నారు శ్రీ క్రాంతి చిత్ర అధినేత క్రాంతికుమార్. మేలో విడుదలయ్యే "శివుడు...శివుడు...శివుడు" చిత్రంలో చిరంజీవి, రాధిక, జగ్గయ్య, రావుగోపాలరావు, గొల్లపూడి, గిరిబాబు, వంకాయల, రాళ్ళపల్లి, పుష్పలత, అన్నపూర్ణ, ప్రమోద్‌కుమార్ ముఖ్య భూమికలు నిర్వహించారు. సత్యానంద్, చక్రవర్తి, వేటూరి, వెంకట్, భాస్కరరాజు, కృష్ణ, వి. రత్నప్రతాప్, గిరిధర్ తెరవెనుక కృషిచేశారు. "హైదరాబాద్ జూబిలీ హిల్స్‌లో ప్రత్యేకంగా నిర్మించిన ఆంజనేయస్వామిగుడి, ఖైదీల కాన్‌సెన్‌ట్రేషన్ కేంప్ సెట్స్‌లో, అన్నపూర్ణా స్టూడియోలో కొన్ని ముఖ్యమైన సన్నివేశాలను చిత్రీకరించాం," అన్నారు ఈ చిత్ర దర్శకుడు ఎ. కోదండరామి రెడ్డి. ★



జయచిత్ర, పద్మనాభం 'పిచ్చిమాలక్ష్మి'లో

# అమెరికాలో 'గాంధీ'

-సత్యం మందపాటి



బల్లనిండుగా ఉన్న బహుమతులతో దర్శకుడు అట్టెన్‌బరో, నటుడు కింగ్‌స్లే, ఎడిటర్ (కూర్చు) బ్లూమ్‌లని చిత్రంలో చూడవచ్చు.

[ఈ వ్యాస రచయిత ప్రస్తుతం అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని హూస్టన్ రాకెట్ ప్రయోగ కేంద్రంలో రాకెట్ ఫ్యూయల్ ఇంజనీరుగా పనిచేస్తున్నారు. —సం.]

అమెరికాలో ఎప్పుడూ ఏదో ఒక సంచలనం కలుగుతూనే వుంటుంది. ఆర్థికంగా దేశాన్ని దెబ్బకొట్టిన ప్రెసిడెంటు రీగన్ సిద్ధాంతాలకన్నా, 'ఛాలెంజర్' అంతరిక్ష ప్రయోగంకన్నా, జనాన్ని ఒక వూపు వూపింది — రిచర్డ్ అట్టెన్ బరో చిత్రం "గాంధీ" —

ప్రతి రెండు సెకన్లకీ ఏదో ఒకచోట, ఒక హత్యో, మానభంగమో, దోపిడీయో జరిగే ఈ దేశంలో "గాంధీ" చిత్రం ఎవరు చూస్తారు? మిత్ర దేశాలన్నిటికీ అడిగినదానికన్నా ఎక్కువగా యుద్ధ పరికరాలు పంపించే అమెరికా — అణు శక్తిని అరచేతిలో పెట్టుకుని ప్రపంచాన్ని భయపెట్టాలనుకుంటున్న అమెరికా — "శాంతి", "అహింస"లను చూపించే ఈ చిత్రాన్ని భరించ గలదా? ఇవన్నీ ఈ దేశంలోని చాలామంది భారతీయ మిత్రులకు కలిగిన అనుమానాలు —

అందరి అనుమానాలనీ పటాపంచలు చేసి, బాక్స్ ఆఫీస్‌లను బద్దలుకొట్టి, ఆస్కార్లను కొల్లగొట్టి — ఎన్నో రికార్డులని సృష్టించి, అందర్నీ ఆశ్చర్యపరిచింది "గాంధీ" చిత్రం.

జనవరిలో అమెరికా అంతటా విడుదలయి, ఈనాటికీ రిలీజయిన ఏ థియేటర్‌లోనించీ పోకుండా పెద్ద దుమారం లేపింది. ప్రతి నెలా "హాలీవుడ్ టాప్ టెన్"లో ముందుకు వస్తూ ధనార్జనలో నాలుగవ స్థానం నించి ప్రస్తుతం రెండవ స్థానం వచ్చింది. ఆస్కార్ బహుమతుల తర్వాత ఒకటవ స్థానంలోకి వస్తుందని పలువురి అంచనా —

"దీనిని మించిన ఉత్తమ చిత్రం లేదు"— అని వ్రాసింది 'నేషనల్ బోర్డ్ ఆఫ్ రివ్యూ.'

"బెన్ కింగ్స్‌లె పాత్ర పోషణ చూస్తుంటే ఏదో అద్భుతమైన భావం కలుగుతుంది" అన్నది 'టైమ్స్'.

"చలన చిత్రాలు నిజంగా ఎంత గొప్ప అనుభూతిని యిస్తాయో చవిచూడాలనుకునే వాళ్ళు చూసితీరవలసిన చిత్రం" అన్నది 'న్యూయార్క్ పోస్ట్'.

"బెన్ కింగ్స్‌లే ఈ చిత్రంలో చూపించిన అమోఘమైన నటన — ఇండియన్ యింక్‌లో వ్రాయాలిసిందే" అన్నది 'బోస్టన్ గ్లోబ్.'

టి. వి. లో సినిమాల గురించి ఎప్పుడూ మాట్లాడేవాళ్ళు, సినిమాల గురించి అసలు మాట్లాడనివాళ్ళు, మాటిమాటికీ చెప్పేది ఒకే విషయం — "గాంధీ" సినిమా కాదు ఒక 'అనుభూతి' అని

ఈ చిత్రం గురించి వచ్చినన్ని రివ్యూలు, కాంప్లిమెంట్స్ అమెరికా టి. వి. చరిత్రలోనే అపూర్వం. "ఆ కర్ర పట్టుకుని ఆయన బ్రిటిష్ వాళ్ళని, ఇండియానించి బయటకు తోలాడంటే ఎలా నమ్ముతాం? కాని నమ్మక తప్పదు. అది చరిత్ర చెప్పిన నిజం —" అన్నాడు 'అమెరికన్ బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ వ్యాఖ్యాత.'

ఇవన్నీ ఎందుకు వ్రాశాను అంటే — ఇక్కడ "మీడియా" ఈ చిత్రం చూసి ఎలా 'రియాక్ట్' అయిందో చూపెడదామని.

ఇప్పటికీ థియేటర్లలో పొడుగాటి క్యూలో ఒక గంట ముందే నుంచుని టిక్కెట్లు కొనుక్కుంటున్నారు జనం. వాళ్ళలో తొంభయి శాతం పైన అమెరికన్లు!

"ఇంతమంది ఖులా తరలిరావటం వింతగా వుంది!" అన్నాడు పొడుగాటి క్యూలో మా వెనకాల నుంచున్న పొడుగాటి ఆయన.

సినిమా చూసి వస్తున్నప్పుడు ఒక తెల్లావిడ "గాంధీ డజన్ట్ బిలాంగ్ టు యువర్ కంట్రీ. హి బిలాంగ్స్ టు ది హోల్ వరల్డ్ అండ్ మాన్‌కైండ్" అన్నది.

కొన్నాళ్ళక్రితం రిచర్డ్ అట్టెన్ బరో "గాంధీ" చిత్రం 'స్క్రిప్టు' పట్టుకుని హాలీవుడ్‌లో అందరిచుట్టూ తిరిగాడు, నిర్మాతల కోసమని. ఈ పెట్టుబడిదారీ దేశంలో ఆయనకు 'పెట్టుబడి' పెట్టేవాడు దొరకలేదు. అయినా పట్టువిడవని విక్రమార్కుడిలా ఇరవయి సంవత్సరాలు నానా కష్టాలుపడి చివరకు భారత ప్రభుత్వ సహాయంతో తన జీవితాశయం నెరవేర్చుకున్నాడు. ఆనాడు ముందుకురాని "హాలీవుడ్" — ఈనాడు ఆస్కార్ బహుమతులతో ఆయనకు, ఆయనకు తోడ్పడినవారికి బ్రహ్మరథం పట్టింది! పదకొండు నామినేషన్లలో 8 బహుమతులను సంపాదించింది "గాంధి!" గత 22 ఏళ్ళలో యిన్ని ఆస్కార్ బహుమతులు ఏ చిత్రానికీ రాలేదు. 1939లో "గాన్ విత్ ది విండ్" పది ఆస్కార్లూ, 1959లో బెన్‌హర్ 11 బహుమతులూ, 1961లో "వెస్ట్ యి సైడ్ స్టోరీ" పది బహుమతులు సంపాదించాయి. వాటి తర్వాత ఇన్ని బహుమతులు వచ్చిన మొదటి విదేశీ చిత్రం "గాంధీ"

'గాంధీ' చిత్రానికి వచ్చిన 8 బహుమతుల లోనూ మొట్టమొదటి బహుమతి తీసుకున్నది 'భాను అత్తయా' ఆవిడ చీర కట్టుకుని వచ్చి బహుమతి తీసుకుంటుంటే ఇండియా 'ఆస్కార్' ప్రపంచంలో కుడిపాదం పెట్టినట్టుగా వుంది. హాలీవుడ్ నటులు లిజామిన్నెలీ, డడ్లీమూర్, రిచర్డ్ ప్రెయర్, వాల్టర్ మాత్తాలు నడిపించిన ఆస్కార్ బహుమతుల ప్రదానంలో మొత్తం 24 బహుమతులలోను 'గాంధీ' 8 బహుమతులను, తర్వాత ఇ. టి. 4 బహుమతులను సంపాదించింది రిచర్డ్ అట్టెన్‌బరో, బెన్‌కింగ్స్‌లేలు బహుమతులు తీసుకుంటుండగా హర్షధ్వనులు మిన్ను

ముట్టాయి. రిచర్డ్ అట్టెన్‌బరో బహుమతి తీసుకుంటున్నప్పుడు, ఆడిటోరియంలో చిన్నా, పెద్దా అందరూ గౌరవసూచకంగా లేచి నుంచున్నారు.

బెన్ కింగ్స్‌లే బహుమతి తీసుకున్న తర్వాత అన్న మాటలు తెలుగులో వ్రాయటంకన్నా ఇంగ్లీష్‌లో వ్రాస్తేనే బాగుంటుంది. ''దిస్ ఈజ్ ఏన్ ఆస్కార్ ఫర్ విజన్, కరేజ్, ఏక్టింగ్ అండ్ ఫేన్'' అన్నాడు.

''నేను పూర్తిగా 'బౌల్డ్' అయాను'' అన్నాడు రిచర్డ్ అట్టెన్‌బరో. ''ఇవాళ మీరు గౌరవిస్తున్నది నన్నుకాదు – గాంధీని. కోట్ల కొద్దీ ప్రజలను ఆయన ఉత్తేజపరిచాడు. ఆ రోజేకాదు ఈ రోజుకూడా ఆయన సిద్ధాంతాలు చాలమందికి మార్గదర్శకం.'' 'మార్టిన్ లూథర్ కింగ్' లాటివారు ఎందరో ఆయనవల్ల ప్రభావితం అయారు. ఈనాటి సమస్యలకు పరిష్కారం, అవతలివాడి తల నరకటంలోలేదు. (శాంతియుతంగా పరిష్కరించుకోవటంలో వుంది.) ఒక దేశం ఇంకో దేశంమీద అణుబాంబులు విసిరేను కోటానికి సిద్ధమవుతున్న ఈ తరుణంలో, ఆనాడు గాంధీజీ చెప్పిందీ, ఈనాడు అట్టెన్‌బరో మళ్ళీ గుర్తుచేస్తున్నదీ అర్థంచేసుకోవటం అందరికీ అవసరం.

బ్రిటిష్ దేశంమీద పోరాడిన వ్యక్తి జీవితాన్ని ఒక బ్రిటిష్ నిర్మాత – దర్శకుడూ చిత్రంగా తీస్తే ఎంతవరకు న్యాయం చేకూరుస్తాడు అన్నది మొదట్లో వచ్చిన విమర్శ. ఎవరుతీసినా, ఇంత గొప్పగా మహాత్ముడిని చిత్రించలేరని ఈనాటి ప్రశంశ. ఆ విమర్శకూ, ఈనాటి ప్రశంశకూ మధ్యనవున్నది– ఒక దేశానికి చెందిన వ్యక్తికాదు. ''గాంధీ'' వ్యక్తిత్వంతో ప్రభావితుడయిన మనిషి. తయారయింది ఒక చిత్రం కాదు– ఒక అనిర్వచనీయమైన అనుభూతి. ★

# జీవన్మృతులు

ఇంగ్లీషు మూలం: బ్రామ్ స్టోకర్

స్వేచ్ఛానువాదం: కొలను వెంకట దుర్గాప్రసాద్




**జరిగిన కథ—28:** ఆ రాత్రికి లూసీ సమాధి దగ్గరకు వచ్చి చూస్తే దాంట్లో ఆమె కనిపించదు. చర్చి ఆవరణలో పొంచివున్న సెవార్డ్‌కి లూసీ కనిపిస్తుంది. వాన్‌హెల్సింగ్‌కి దొరికిన పసిపాపను పోలీసులకి అప్పగిస్తారు. కానీ ఆ పాప మెడపై గాట్లు లేకపోవడం గమనిస్తారు. ప్రొఫెసర్ వాన్‌హెల్సింగ్ ఉత్తరం ద్వారా ఆర్థర్‌ను, క్విన్సీమోరిస్‌లను రప్పిస్తాడు. వాళ్ళకి కూడా సెవార్డ్‌కి చూపించిన దృశ్యాన్ని చూపిస్తాడు. ఆర్థర్‌ని గుర్తుపట్టిన లూసీ అతన్ని చేరుకోబోయేంతలో వాన్‌హెల్సింగ్ అడ్డుపడతాడు. లూసీ సమాధిలోకి వెళ్తుంది. లూసీ శరీరంలో ప్రవేశించిన రాక్షసిని హతమారుస్తాడు ఆర్థర్, వాన్‌హెల్సింగ్ చెప్పిన విధంగా. జోనాథన్ డైరీ చదివి కొన్నివిషయాలు తెలుసుకుంటాడు డాక్టర్ సెవార్డ్. జోనాథన్ 'డ్రాకులా' గురించిన వివరాలను సేకరిస్తుంటాడు. మినాహార్‌కర్ తనకు తానే మిస్టర్‌రెన్‌ఫీల్డ్‌కు పరిచయం చేసుకుంటుంది. డాక్టర్ వాన్‌హెల్సింగ్‌కు మినా తన డైరీని ఇస్తుంది. పవిత్రమైన బుల్లెట్‌తో డ్రాకులా శవపేటికను పేల్చితే అతను నిజంగా చనిపోతాడని చెపుతాడు వాన్‌హెల్సింగ్. వాన్‌హెల్సింగ్, మోరిస్, జోనాథన్ మినాను వదిలి కార్యక్రమంలోకి దిగుతారు. డాక్టరు సెవార్డు ఆర్థర్, వాన్‌హెల్సింగ్, మోరిస్‌లకు రెన్‌ఫీల్డ్‌ను పరిచయం చేస్తాడు. వాన్‌హెల్సింగ్, మోరిస్, జోనాథన్ డ్రాకులా ఇంటి తాళం తీసారు. ఆ ఇల్లు సకల రోగాలతో ఉన్నట్లు, రక్తపు వాసనలతో పరమ రోతగా ఉంది. అక్కడ యాభయికి ఇరవై తొమ్మిది పెట్టెలు మాత్రమే ఉన్నాయి. అక్కడ ఉన్న వేసకు వేల ఎలుకలను కుక్కల సహాయంతో తోలేసారు. డ్రాకులా ఇంటిలో ఏం జరిగిందో మినా తెలుసుకోవాలనుకుంటుంది.

(గత సంచిక తరువాయి)

(మినా డైరీ)

రాత్రి వీళ్ళంతా వెళ్ళిన తర్వాత నేను పక్క మీదకు జేరాను. నిద్రపట్టలేదు. మనసంతా ఆందోళనతో నిండిపోయింది. గతంలో జరిగినవన్నీ గుర్తుకొచ్చాయి. జోనాథన్ నన్ను మొట్టమొదటిసారి చూడటానికి లండన్ వచ్చిన దగ్గర్నించి, మొన్నటి దాకా, ఎక్కువ విషాద సంఘటనలే జరిగాయి. నేను 'విట్‌బీ' వెళ్ళకపోయినట్టయితే పాపం లూసీ బ్రతికి వుండేదనిపిస్తోంది. అక్కడి చర్చి ప్రాంతానికి మొదటిసారిగా నాతోనే వచ్చింది. అక్కడికి వెళ్ళకపోయినట్టయితే, రాత్రిపూట నిద్రలో నడుచుకుంటూ, వెళ్ళివుండేది కాదనిపిస్తోంది. ఆమె వెళ్ళడం మూలానేకదా, ఆ డ్రాకులా ఆమెను వశపరచుకున్నది! అసలు నే వెందుకు 'విట్‌బీ' వెళ్ళానా అనిపిస్తోంది. నాకు ఏడుపు వస్తోంది. ఇవాళెందుకు నేనిలా అయిపోయాను? జోనాథన్‌కి నా దుఃఖం గురించి తెలియనీయకూడదు. నా గురించి నేనెప్పుడు ఏడవలేదు. జోనాథన్ ఎప్పుడూ నన్ను దుఃఖపెట్టలేదు. నేను ఏడుస్తున్నానంటే, అతను బాధపడతాడు. కాబట్టి గంభీరంగా కనపడాలి.

రాత్రి గాఢంగా నిద్రపోయాననిపిస్తోంది. వున్నట్టుండి కుక్కల అరుపులు వినిపించాయి. దగ్గర్లోవున్న రెన్‌ఫీల్డు గదిలోంచి ఏవో ప్రార్థనలు చేస్తున్న శబ్దాలు వినిపించాయి. తర్వాత అంతా నిశ్శబ్దం. ఆశ్చర్యపడేంత నిశ్శబ్దం. వుండబట్టలేక కిటికీ దగ్గరకు వెళ్ళాను. బయట అంతా చీకటి, నిశ్శబ్దం. ఏ వస్తువులో కూడా కదలిక కనపడలేదు. సన్నగా తెల్లటి పొగలాంటిది, ఆ ఇంటివేపు దూసుకుంటూ వెళ్ళటం కనిపించింది. నేను బాగా ఆలోచనల్లో వుండటం మంచిదే అయింది. కాసేపటికి బద్ధకం ఆవరించింది. నిద్రరాలేదుగానీ, కదలకుండా పడుకున్నాను. కానీ మళ్ళీ లేచి వెళ్ళి కిటికీలోంచి బయటకుచూసాను. ఆ తెల్లటి పొగ బాగా విస్తరించి ఇంటిగోడ మీదకు చేరింది, కిటికీగుండా లోపలి వెళ్ళిబోతున్నట్టుగా. రెన్‌ఫీల్డు గొంతుమాత్రం హెచ్చుస్థాయిలో వినపడుతోంది, ఒక్కముక్క అర్థంకాకపోయినా. ఏదో పెనుగులాట చప్పుడుకూడా వినపడింది. బహుశా పనివాళ్ళు అతనితో తలపడివుంటారు. నాకు భయమేసి, వచ్చి మంచంమీద పడుకుని, నిండా ముసుగు పెట్టాను. చెవుల్లో వేళ్ళుదూర్చాను. తర్వాత నిద్రపట్టేసిందనుకుంటాను. ఎందుకంటే, తర్వాత జోనాథన్ లేపేవరకు అన్నీ ఏవేవో కలలే! మిగతా సంగతులు ఏవీ జ్ఞాపకంలేవు. జోనాథన్ నామీదకు వంగి మేల్కొలుపుతుంటే, కాసేపటివరకు, నేనెక్కడున్నానో అర్థం కాలేదు. అదంతా ఏవేవో కలలవల్లననుకుంటా. నా కలలు చాలా వింతగా వున్నాయి.

జోనాథన్ కోసం ఎదురుచూస్తూ నిద్రపోయాను. అతనికోసం ఆదుర్దాగా వుంది, కానీ నేనేంచెయ్యగలను. కాళ్ళూ చేతులు ఆడక అలాగే పడుకుండిపోయాను. వికలమైన మనసుతో పడుకున్నాను, అందువల్లనే పిచ్చిపిచ్చి కలలు.

నేనువున్న పరిసరం, చల్లగా అయిపోయింది. మొహంమీద కప్పుకున్న ముసుగుతీసి చూసాను చుట్టూ అంతా మసకమసకగా కనిపించింది. జోనాథన్ కోసం వెలిగించి వుంచిన దీపం బాగా తగ్గించి వుంది. చిన్న ఎరుపు రంగు తప్ప దాని వెలుతురులేదు. చుట్టూ పొగమంచు కప్పేసినట్టు తెలుసుకున్నాను. నేను పడుకోబోయేముందు కిటికీ తలుపులు వేసేసివచ్చానన్న సంగతి గుర్తుకు వచ్చింది. లేచి వెళదామంటే, తెలీని బద్ధకం నన్ను లేవనీయలేదు అట్లాగే పడుకుండిపోయాను. కళ్ళమూసుకున్నాను. కానీ నా కనురెప్పగుండా ఏవిటో చూడగలుగుతున్నాను. అవే కలలు! ఆ పొగమంచు క్రమంగా దట్టంగా అలుముకోసాగింది. అది కిటికీలోంచి వచ్చింది కాదు. తలుపు సందునుంచి వస్తున్నట్టు తెలుసుకున్నాను. అట్లా క్రమక్రమంగా పెరిగ ఒక పెద్ద మేఘంలా గదిలో ఏర్పడింది. వస్తువులన్నీ తిరుగుతున్నట్టు అనిపించాయి. ఏవో మంత్రాలు వినిపించాయి. ఏదైనా దైవబలమా? ఏమిటో అర్థం కాలేదు. ఆ దట్టమైన మేఘంలో రెండు ఎర్రటి కళ్ళు కనిపించాయి. లూసీ ఒకసారి చెప్పినట్టుగా వున్నాయి అవి. హఠాత్తుగా అది నా మీద పడ్డట్టు అయింది, జోనాథన్ మీదకు ఆ దెయ్యాలు పడ్డట్టుగా. నేను తట్టుకోలేక మూర్ఛపోయి వుంటాను. అందువల్లనే అంతా చీకటితప్ప ఏమీ అనుభవం కాలేదు. ఏదో ఒక తెల్లటి ఆకారం నామీదకు వంగుతున్నట్టు మాత్రం లీలగా గుర్తుంది. ఇలాంటి కలలుగంటే, మనసు చెదిరిపోతుంది. డాక్టర్ వాన్ హెల్సింగ్‌నుగానీ, డాక్టర్ సెవార్డునిగానీ, నిద్ర పోవటానికి ఏదైనా మంచి మందు ఇవ్వమని అడగాలి. కానీ వాళ్ళ ఆందోళన పెందుతారేమో? ఇవాళ నా అంతట నేనే మామూలుగా నిద్రపోవటానికి, ప్రయత్నిస్తాను నిద్ర పట్టకపోతే రేపు వాళ్ళని మందు అడుగుతాను. హాయిగా నిద్రపోవచ్చు. రాత్రి మాత్రం, మేలుకున్న దానికంటే అలసట అనిపించింది.

అక్టోబర్, 2, సమయం, రాత్రి పదిగంటలు, రాత్రి నేను నిద్రపోయాను. కలలు రాలేదు. బాగా నిద్రపోయాననే అనుకోవాలి, జోనాథన్ దగ్గరకు వచ్చినా మెలకువ రాలేదు. నిద్రపోయినప్పటికీ గానీ బాగా నీరసంగానూ, నిరుత్సాహంగానూ వుంది. నిన్న పగలంతా చదవటానికి ప్రయత్నించటమో, నిద్రలో జోగుతూ వుండటమో చేసాను. మధ్యాహ్నం,

రెన్‌ఫీల్డు నన్ను చూడగోరాడు. పాపం చాలా సౌమ్యంగా ప్రవర్తించాడు. తిరిగి వచ్చేస్తుండగా, నా చేతిని ముద్దు పెట్టుకుని వీడ్కోలు చెప్పాడు. అది నా మనసును కదిలించింది. అతని గురించి ఆలోచిస్తుంటే, మనసు మూగగా రోదిస్తోంది. ఇదో కొత్త బలహీనత. నేను చాలా జాగ్రత్తగా వుండాలి. నేను మౌనంగా రోదిస్తున్నానని తెలిస్తే, జోనాథన్ చాలా బాధపడ్తాడు. అతను, అతని మిత్రులు భోజనం వేళవరకు బయట గడిపారు. అందరూ అలసిపోయి వచ్చారు. వాళ్లలో అలసట పోగొట్టటానికి నేను హుషారుగా వుండాల్సి వచ్చింది, నా అలసట మరచిపోయి. భోజనాలు అయినతర్వాత నన్ను వెళ్లి పడుకోమన్నారు. ఆ రోజు వారి వారి అనుభవాలు చెప్పుకోవడం కోసం నన్ను దూరంగా వుంచదలచారు. జోనాథన్ మనసులో ఏదో చెప్పాల్సిన విషయం వున్నట్టుగా కనిపించాడు. నాకు నిద్ర రాలేదు, డాక్టర్ సెవార్డును మందు ఇవ్వమని అడిగాను. రాత్రి నిద్ర పట్టలేదని చెప్పాను. మందు ఇచ్చాడు. ఆ మందు కొద్దిగా వాడినందువల్ల ప్రమాదం లేదన్నాడు. ఆ మందు ఇప్పుడు వేసుకున్నాను. నిద్రకోసం ఎదురు చూస్తున్నాను. నిద్ర వచ్చేస్తోంది. గుడ్‌నైట్.

## జోనాథన్ డైరీ :

అక్టోబర్, 1 సాయంత్రం : బెత్‌నాల్ గ్రీన్‌లో థామస్ స్నెల్లింగ్ ఇంటికి వెళ్లాను. అతనికి విషయాలు ఏవీ గుర్తులేవని తెలిసేసరికి నిరుత్సాహమేసింగి. అతని భార్య చెప్పింది, స్మోలెట్ అనే అతన్ని కలుసుకోమని, అక్కడ్నించి వెంటనే జోసెఫ్ స్మోలెట్ ఇంటికి వెళ్లాను. అతను సాదా చొక్కా వేసుకుని, సాసర్‌లో టీ పోసుకుని తాగుతూ కనిపించాడు. చాలా నమ్మదగిన మంచి మనిషిలా కనిపించాడు. పెట్టెల గురించి అతనికి అన్నీ గుర్తే ! తన లాగు వెనుక జేబులోంచి ఒక పొడుగాటి నోట్‌బుక్ తీసాడు. దానిలో పెన్సిల్‌తో ఏవేవో రాసాడు; పెట్టెలు ఎక్కడికి వెళ్లిందీ చెప్పాడు. ఒక బండిలో ఆరుపెట్టెలను తీసుకుని 'కార్‌ఫాక్స్' నుంచి బయలుదేరి 197, చిక్‌సాండ్ స్ట్రీట్, మైల్‌ఎండ్, న్యూటౌన్‌లో వదిలారు. మరో ఆరు పెట్టెలు జమైకాలేన్, బార్‌మాండ్‌సీలో వుంచారు. వీటన్నిని డ్రాకులా అక్కడక్కడా వుంచి, తర్వాత వాటిని మళ్లా ఎక్కడికో పంపించాలని పథకం వేసుకున్నట్టున్నాడు. లండన్ కిరువైపులా కాకుండా, ఇంకా ఎక్కువ చోట్లకి ఈ పెట్టెలను బదిలీ చేసివుంటాడని నా అనుమానం. కార్‌ఫాక్స్ నుంచి మిగతా పెట్టెలు ఎక్కడికి తీసుకెళ్లారని స్మోలెట్‌ని అడిగాను.

అర్ధసావరిన్ ఇచ్చాక అతను చెప్పటం మొదలెట్టాడు. అతను చెప్పినదాన్నిబట్టి శామ్‌బ్లోగ్జామ్ అనే అతను నాలుగు రోజులక్రితం ఈ పనికి ఏర్పాట్లు చేసాడని చెప్పాడు. అతనెక్కడుంటాడో చెప్పమన్నాను. అతని అడ్రసు ఇస్తే, మరో అర్ధసావరిన్ ఇస్తానని చెప్పాను. అతను మిగతా టీ ఒక్కగుక్కలో తాగేసి ఇప్పుడే వెతికి చెప్తానని బయలుదేరాడు.

గుమ్మందగ్గరికి వెళ్లాక ఆగి ''మిమ్మల్ని ఆపి వుంచడం అనవసరం. శామ్ దొరుకుతాడుగానీ, వెంటనే చెపుతాడని నమ్మకంలేదు. అతన్ని బాగా తాగిస్తేగానీ చెప్పడు. ఒక కవరుమీద స్టాంపు అంటించి మీ చిరునామా రాసి నాకివ్వండి. అతని చిరునామా కనుక్కుని మీకు తెలియజేస్తాను. అప్పుడు మీరు అతన్ని కలుద్దురుగానీ'' అన్నాడు.

వాళ్ళబ్బాయి నా దగ్గర ఒక పెన్నీ తీసుకుని బయటకు పరుగెత్తాడు, కవరు, స్టాంపు, కాగితం కొనుక్కురావటానికి. మిగతా చిల్లర ఆ కుర్రాడ్ని వుంచేసుకోమన్నాను. కవరు తెచ్చాక, స్టాంపు అతికించి, దీనిమీద నా చిరునామా రాసాను. శామ్ అడ్రసు కనుక్కుని, తప్పకుండా కవరు పోస్టుచేస్తానని చెప్పాడు. మొత్తానికి బండి కాస్త దార్లో పడింది. బాగా అలసిపోయాను. ఇవాళ రాత్రికి బాగా నిద్రపోవాలి.

మినా మంచి నిద్రలోవుంది. బాగా పాలిపోయినట్టుగావుంది మొహం. ఆమె కళ్లు ఏడ్చినట్టుగా వున్నాయి పాపం, మా అందరిగురించి బాగాఆందోళన





చెందుతున్నట్టుంది. ఆమెకు ఏమీతెలియనీకపోవటం వల్ల ఆ ఆందోళన. అలా వుంటేనే మంచిది. తెలిస్తే ఆమెకు ఇంకా ఆందోళన కలుగుతుంది. ఈ విషయాలకు దూరంగా వుంచమని డాక్టర్లు ఇద్దరూ మంచి సలహా ఇచ్చారు. నేనుకూడా విషయాలు చెప్పకుండా, చాలా నిగ్రహంతో ప్రవర్తించాలి. అట్లా వుండటం నాకు తేలికయినపనే. ఎందుకంటే ఆమె డ్రాకులా విషయాలగురించి ఏమీ మాట్లాడ్డంలేదు.

అక్టోబర్, 2 సాయంత్రం : ఇవాళ అంతా చాలా పనులు జరిగాయి. మొదట పోస్టులో ఒక కవరు వచ్చింది. అది నేను ఇచ్చిందే. దానిలోపల చిన్న నలిగిన కాగితంమీద పెన్సిలుతో రాసిన అడ్రసు వుంది.

"శామ్ బ్లోగ్జామ్, కొర్కోరాన్స్ 4, పాటర్స్ కోర్టు, బార్టెల్ స్ట్రీట్, వాల్‌వర్తు. 'డిస్పెట్' అనే వ్యక్తిని అడగండి."

నేను మంచంమీద పడుకుని వుండగా ఈ కవరు వచ్చింది. మినాను నిద్ర లేపకుండా లేచాను. మగతగా పడుకుని వుంది. పాలిపోయి వుంది. ఆమెను నిద్ర లేపకూడదనుకున్నాను, ఏమయినా సరే. ఈ చిరునామా తాలుకు మనిషిని వెతికి పట్టుకున్నాక, మినాను ఎగ్జిటర్‌కి పంపించేద్దామన్న ఆలోచన వచ్చింది. సొంత యింట్లో వుంటేనే ఆమె అక్కడి పనుల్లో మునిగిపోయి, కాస్త ఉత్సాహంగా వుంటుంది. మా మధ్య వుంటే ఆమెకు ఆందోళన తప్ప వేరే వుండదు. డాక్టర్ సెవార్డు కనపడితే ఒక్క క్షణం చూసి, ఎక్కడి కెళుతున్నానోచెప్పాను. వెళ్ళివచ్చిన తర్వాత మిగితా విషయాలు మాటాడ్ల తానని చెప్పాను.

వాల్‌వర్తు ప్రాంతం వెళ్ళాను. పాటర్స్ కోర్టు కనుక్కోవడం కొంచెం కష్టం అయింది. స్మోలెట్ రాసిన తప్పుడు స్పెల్లింగ్‌వల్ల ఆలస్యం అయింది. కొర్కోరాన్స్ లాడ్జింగ్ సులభంగానే తెలుసుకున్నాను. అక్కడికి వెళ్ళి తలుపు తట్టగా ఒక మనిషివచ్చాడు. "డిస్పెట్" కావాలని అడిగాను. ఆ పేరుగలవా రెవరూ లేరన్నాడు. తన జీవితంలో అలాంటి పేరు వినలేదన్నాడు. అసలు అటువంటి పేరుగలవారైనా వుంటారా అని ఎదురు ప్రశ్న వేసాడు. వెంటనే స్మోలెట్ పంపిన చిన్న చీటి బయటకు తీసాను. చిరునామా చదివి వినిపించాను. మీరేంచేస్తుంటారని అడిగాను.

నేను 'డెపిటీ' అన్నాడు. అయితే అతను స్పెల్లింగ్ తప్పురాసి వుంటాడని గ్రహించాను. డెపిటీ అంటే 'డెప్యూటీ' అన్నమాట. ఈ డెప్యూటీకి అర్థసావరిన్ కానుకగా ఇచ్చాను. శామ్‌బ్లోగ్జామ్ గతరాత్రి అక్కడే వున్నాడనీ, పాప్లార్ అనేచోట పనికి ఉదయం అయిదు గంటలకే బయలుదేరి వెళ్ళాడని చెప్పాడు. పాప్లార్ ఎక్కడవుందని అడిగాను. చెప్పలేక పోయాడు. గిడ్డంగి ప్రాంతం అని చెప్ప గలిగాడు. ఆ మాత్రం ఆచూకీ చాలు అనుకుని బయలుదేరాను. అప్పటికి పన్నెండు అయింది. చిన్న కాఫీహోటల్లోకి అడుగు పెట్టాను. కొంతమంది పనివాళ్ళు అక్కడ తినడానికొచ్చారు. వాళ్ళను కనుక్కుంటే చెప్పారు, అది క్రాస్ ఏంజిల్ స్ట్రీట్‌లో వుందని. అక్కడ్నించి బయలుదేరాను. అక్కడ గేట్‌కీపర్‌కి, ఫోర్‌మన్ లంచం పడేస్తే, శామ్ బ్లోగ్జామ్ ఆచూకీ దొరికింది. ఇతని రోజు కూలి, ఇతని ఫోర్‌మన్‌కి లంచంగా ఇస్తే ఇతన్ని ఇంటర్వ్యూ చేయటానికి వీలుపడింది. అతని మాటలు చాలా కరుకుగా వున్నాయి. కావలసిన విషయం చెపితే కొంత లంచం ఇస్తానన్నాను. కార్‌ఫాక్స్ నుంచి 'పికడిల్లీ'కి రెండుసార్లు పెట్టెలు తీసుకుని తిరిగానన్నాడు. తొమ్మిది పెట్టెలు తీసు కెళ్ళానన్నాడు. బాగా బరువుగా వున్నాయని చెప్పాడు. గుర్రబండి మీద కిరాయి మాట్లాడుకుని చేర వేసాడట. పికడిల్లీలో ఏ ఇంటికి చేరవేసారో ఆఇంటి నెంబరు చెప్పమన్నాను.

"గుర్తులేదు సార్, వైట్ చర్చి దగ్గర్నుంచి కొన్ని ఇళ్ల ఇవతల, పెద్ద ఇల్లేంకాదు. చాలా పాతది. దుమ్ముకొట్టుకుపోయి వుంది. పెట్టెలు ఎక్కడ్నించి తెచ్చామో, ఆ ఇల్లు కూడా చాలా పాతదే" అన్నాడు.

"ఈ పెట్టెలు ఎవరు చేరవేయమన్నారు ?" అడిగాను.

"ఎవరో ఒకతను ఫర్‌స్లీట్‌లో ఇంటి దగ్గర వున్నాడు. పెట్టెలు బండిలో ఎత్తి పెట్టడానికి అతనే సాయం చేసాడు. అంత బలశాలిని నేనెప్పుడూ చూడలేదు. చూడటానికి ముసలివాడిలా వున్నాడు. తెల్లటి మీసం వుంది."

అతని వివరణ వినేసరికి ఒళ్లు గగుర్పొడిచింది.

"ఆ పెట్టెల్ని ఇట్లా ఎత్తి అట్లా బండిమీద పడేసాడు. నేనైతే రొప్పుతూ చచ్చేవాణ్ని" అన్నాడు.

"పికడిల్లీలో వున్న ఇంట్లోకి ఎలా వెళ్లావు ? అక్కడ ఎవరైనా వున్నారా ?"

"ఇతనే అక్కడ కూడా వున్నాడు. అతను నాకంటే ముందు అక్కడికి చేరుకున్నట్టున్నాడు. బెల్ కొట్టగానే, అతనే వచ్చి తలుపు తీసాడు. పెట్టెలన్నీ లోపలికి చేరవేయటానికి అతనే మళ్లీ సాయం పట్టాడు" అన్నాడు.

"ఆ మొత్తం తొమ్మిది పెట్టెలూ లోపల పెట్టారా ?"

"అవును. మొదటిసారి అయిదు పెట్టెలు, రెండోసారి నాలుగు పెట్టెలు."

"ఆ పెట్టెల్ని ఇంటి హాల్లో పెట్టారా ?"

"అవును. అక్కడో పెద్ద హాలు వుంది. ఆ హాల్లో ఒక్క వస్తువు కూడా లేదు."

"ఆ ఇంటి తాళాలేమైనా నీ దగ్గర వున్నాయా ?"

"లేవు. ముసలతనే తలుపు తీసాడు. పని అయిన తర్వాత వేసాడు" అన్నాడు.

"అయితే ఆ ఇంటి నెంబర్ చెప్పలేనంటావు"

"చెప్పలేను. కానీ, ఆ ఇంటిని గుర్తించడం అంత కష్టమయిన పనేంకాదు. ఆ ఇల్లు కాస్త ఎత్తులో రాళ్లతో కట్టబడి వుంటుంది. తలుపు వరకు పెద్ద పెద్ద మెట్లు వుంటాయి. నాకు బాగా గుర్తు. ఆ పెట్టెల్ని మెట్లమీదుగా లోపలికి తీసుకెళ్లాం. బయట అక్కడ ముగ్గురు పనికిమాలిన వెధవలు దొరికారు. కాసిన్ని డబ్బులు ఇస్తాననగానే పెట్టెలు లోపలికి సాయంపట్టారు. పెట్టెల బరువు తెలిశాక అతన్ని ఎక్కువ డబ్బులు అడిగారు. దాంతో అతనికి కోపంవచ్చి, ఒకడ్ని ఎత్తి మెట్లమీంచికిందకుపడేశాడు. మిగతా ఇద్దరూ తిట్టుకుంటూవెళ్లిపోయారు. ఇంటి ఆచూకీతెలిసిందిగాబట్టి అక్కడ్నించి పికడిల్లీవెళ్లాను.

బరువైన పెట్టెలు సులభంగా ఎత్తాడంటే; అతనే డ్రాకులా అయివుండాలి. కాబట్టి కాలం వృధా చెయ్యకూడదు. అతను పెట్టెల్ని అక్కడక్కడా సర్ది పెట్టేస్తున్నాడు, ఎవరికంటా పడకుండా. పికడిల్లీ సర్కస్ దగ్గర నేను బండిదిగి అక్కడ్నించి నడుచు కుంటూపడమరవైపువెళ్లాను. కొంతదూరంపోయాక అతను చెప్పినలాంటి ఇల్లు కనిపించింది. ఆ ఇల్లు చాలాకాలం ఖాళీగా వుంచినదానిలా వుంది. కిటికీ తలుపులు దుమ్ముకొట్టుకుపోయాయి. కిటికీ చట్రాలు బాగా నల్లబడిపోయాయి. పైపూత రంగు బాగా వెలిసిపోయింది. బాల్కనీలో పెద్ద నోటీసుబోర్డువున్న ఆనవాలు కనపించింది. కాస్త దగ్గరగా వెళ్ళిచూసాను, ఆ బోర్డుమీద ఇంటి యజమాని పేరు వుంటుందేమోనని. కనీసం పాత ఇంటి యజమాని పేరు తెలుసుకోగలిగినా చాలు, కొంత సంతృప్తి.

అటువంటిదేమీ దొరకలేదు. ఇంటి వెనకవేపు వెళ్లాను. అక్కడ కొన్ని ఇళ్ళువున్నాయి. ఒకరిద్దరి పనివాళ్లు అక్కడ కనిపిస్తే అడిగాను, ఈ ఖాళీ ఇంటిగురించి. ఆ ఇల్లు ఎవరో ఒకతను తీసుకు న్నట్టు విన్నానన్నాడు ఒకడు. ఎవరు అమ్మారో అతని పేరు తెలీదన్నాడు. మొన్నటివరకు 'ఇల్లు అమ్మబడును' అన్న బోర్డు వుండేదనీ, ఆ బోర్డు బహుశా మిచెల్, సన్స్ అండ్ కాండీ, హౌస్ ఏజంట్లు పెట్టివుంటారన్నాడు. నేను మరీ ఈ విషయంమీద కుతూహలంగావున్నట్టు కనిపించకుండా అక్కడ్నించి బయలుదేరాను. చీకటిపడుతోంది. తొందరగా పని ముగిద్దామని సాక్‌విల్ స్ట్రీట్‌లోవున్న ఆ కంపెనీకి వెళ్లాను.

అక్కడవున్న మనిషిని ఇంటి విషయం గురించి అడిగితే చాలా ముభావంగా వున్నాడు. ఎవరు కొన్నారని అడిగాను. దానికి అతను కళ్ళు పెద్దవిచేసి చూసాడు. కొన్ని క్షణాల మౌనం తర్వాత 'ఎవరో కొన్నారు' అన్నాడు.

"అదిసరే, దయచేసి ఎవరు కొన్నారో చెప్పండి. కొన్ని కారణాలవల్ల అడుగుతున్నాను." అన్నాను ఎంతో సౌమ్యంగా.

మళ్లీ కళ్లు పెద్దవిచేసి చూసాడు. "ఎవరో కొన్నారులెండి" అన్నాడు.

"అది సరే, మీకు అభ్యంతరం లేకపోతే ఎవరు కొన్నారో చెప్పండి" అన్నాను.

"నాకు అభ్యంతరం వుంది. మా క్లయింట్లు విషయాలు చాలా రహస్యంగా వుంచుతాము" అన్నాడు. అతనితో వాదించి ప్రయోజనం లేదని పించింది.

"మీలాంటివాళ్ళు వుంటే, మీ క్లయింట్లు సంతోషంగా వుంటారు. ఎందుకంటే, నేనూ, అటువంటి వృత్తిలో వున్నవాడ్నే" అంటూ నా విజిటింగ్ కార్డు ఇచ్చాను. "నేను పూర్కే అడగటం లేదు. గాడ్ ఆల్మింగ్ ప్రభువు ఈ ఇంటి గురించి వాకబు చేయమన్నారు, అమ్ముతున్నారని తెలిసి" అన్నాను. అతను కాస్త దిగివచ్చినట్టు కనిపించాడు

# ఉచితం!

ఇప్పుడు
ఆకర్షణీయమైన
బహుమతితో
లభిస్తుంది

మురికిని పూర్తిగా
తొలగించే

# రీగల్

నేడే కొనండి
ఆకర్షణీయమైన
బహుమతితో

ACIL.0537-83 Tel




* రీగల్ బహుమతి లేకుండాను లభించును.

"తప్పకుండా చెప్తాను మిస్టర్ హార్కర్. అందులోనూ ఆ ప్రభువు కోసం ఇంతకీ ముందు కొన్ని ఇళ్ళు అద్దెకు మాట్లాడాం కూడా. మీరు ఆ ప్రభువు చిరునామా ఇవ్వండి, వివరాలన్నీ తెలుసుకుని ఆయనకు రాస్తాను. ఇవాళ రాత్రికే పోస్టులో వేస్తాను. అడుగుతున్నది ప్రభువుకాబట్టి, కొన్ని విషయాలు చెప్పక తప్పదు, కంపెనీ అభ్యంతరాలు వున్నప్పటికీ" అన్నాడు.

అతనితో వాదన మంచిది కాదని తెలుసు. అందుకని ఆర్థర్ చిరునామాగా, డాక్టర్ సెవార్డు చిరునామా ఇచ్చాను. అక్కణ్నించి బయలుదేరాను. బాగా చీకటి పడింది. బాగా అలసటగానూ, ఆకలిగానూ వుంది. అక్కడే ఒకచోట టీ తాగి, రైల్లో తిరిగి వచ్చేసాను.

అందరూ ఇంట్లోనే వున్నారు. మినా బాగా అలసిపోయినట్లు, పాలిపోయినట్లు కనిపించింది. అయినా ఉత్సాహంగా వుండటానికి ప్రయత్నించింది. ఈ విషయాలన్నీ ఆమె దగ్గర దాస్తున్నందుకు నాకు చాలా బాధగా వుంది. అయినా తప్పదు. ఈ రాత్రికి కాస్త ఓపిక పడితేసరి.

ఈ రోజు జరిగిన విషయాలు మిగతావాళ్లకు చెప్పలేదు, మినా వుండటంవల్ల. భోజనాలు అయిన తర్వాత, మినాను ఆమె పడకగదిలోకి తీసుకెళ్లాను. ఆమె ఎంతో వదిలిపెట్టి వుండలేనట్లుగా ప్రవర్తించింది. నన్ను కౌగలించుకుని వుండిపోయింది. కానీ మిగతావాళ్లతో మాట్లాడవలసిన విషయాలుండటం చేత, ఆమెను వదిలి తిరిగి వచ్చేశాను.

అందరూ అక్కడ కూర్చుని వున్నారు. ఇప్పటి వరకూ జరిగినదంతా, రైల్లోనే డైరీ రాసేసాను. రాసిందంతా వాళ్లకు చదివి వినిపించాను, వేరే చెప్పనవసరం లేకుండా. నేను చదవటం పూర్తిచేశాక వాన్‌హెల్సింగ్ అన్నాడు—

"మిత్రమా జోనాథన్, ఇవాళ మీరు చేసిన పరిశోధన చాలా బాగుంది. కనపడని పెట్టెల ఆచూకి తొందరగానే తెలుస్తుంది. ఆపెట్టెలు ఆ ఇంట్లో దొరికితే, మన పని పూర్తయినట్టే. ఇంకా లెక్కతేలని వుంటె వాటి ఆచూకీ కూడా తెల్సుకోవాల్సి వుంటుంది. తర్వాత అతన్ని వెంటాడి, మట్టుపెట్టొచ్చు."

"మనం ఆ యింట్లోకి ఎట్లా వెళతాం?" అడిగాడు మోరిస్.

"ఆ ఇంట్లోకి వెళ్ళాం కదా, అట్లాగే!" అన్నాడు ఆర్థర్ వెంటనే.

"కానీ ఆర్థర్! అట్లాగే వెళ్ళటానికివీల్లేదు, ఇది మరో రకం. కార్‌ఫాక్స్‌లో వున్న ఇంటికి వెళ్ళాం. రాత్రిపూట వెళ్ళాం. పైగా ఆ ఇంటి చుట్టూ గోడవుంది. కానీ పికడిల్లీ ఇంట్లోకి చొరపడ్డం చాలా కష్టం, పగలుగానీ, రాత్రిగానీ. ఎట్లా వెళ్ళాలో నాకైతే ఏమీ తోచడం లేదు, ఆ హౌస్ ఏజంట్ ఏదైనా తాళంచెవి ఇస్తే తప్ప. అతని దగ్గర్నుంచి నువు అది రాబడితే మనం చెయ్యగలిగింది ఆలోచించవచ్చు" అన్నాడు వాన్ హెల్సింగ్.

ఆర్థర్ బాగా ఆలోచనలోపడి గదిలో అటూ ఇటూ పచార్లు చేయసాగాడు.

## జీవన్ మృతులు

"ఈ విషం క్విన్సీ మోరిస్ ఆలోచించాలి. ఒకసారి ఇంట్లోకి జొరబడి ఎట్లాగో తప్పించుకున్నాం. ఈసారి అట్లా కాదంటున్నారుగదా. మనం డ్రాకులా తాళాలగుత్తి సంపాదించాలి" అన్నాడు ఆర్థర్.

అప్పటికి ఏమీ చెయ్యలేమనిపించింది. హౌస్ ఏజంటు మిచెల్ దగ్గర్నుంచి ఆర్థర్‌కి ఉత్తరం రావల్సి వుంది. అప్పటివరకు వేచి వుండటం మంచిదనుకున్నాం. అందరం కూర్చుని పొగతాగుతూ డ్రాకులా విషయం గురించే బాగా చర్చించాం. వాళ్లు మాట్లాడుకుంటూ వుండగా నేను డైరీ రాయటం పూర్తిచేసాను. నిద్ర ముంచుకు వస్తోంది. పడుకోవాలి... ...

మరో వాక్యం రాయాలి. మినా బాగానే నిద్రపోతోంది. నిద్రలో కూడా ఏదో ఆలోచిస్తున్నట్లుగా ఆమె నొసలు చిట్లిస్తోంది. మొహం పాలిపోయింది. రేపు ఆమెను ఎగ్జిటర్‌కి పంపేయాలి. అబ్బ! బాగా నిద్ర వచ్చేస్తోంది.

### డాక్టర్ సెవార్డు డైరీ:

అక్టోబర్ 1: రెన్‌ఫీల్డు విషయం తికమక పెట్టేస్తోంది. నిముష నిముషానికీ అతని చేష్టల్లో మార్పులు వచ్చేస్తున్నాయి. వాటిని అర్థంచేసుకోడం కష్టంగావుంది. అతన్ని చూస్తుంటే, మనిషిని అనుకోడానికి వీల్లేదు. ఉదయం అతన్ని చూడటానికి వెళ్లాను. తనొక గొప్ప శక్తిగా వూహించుకుంటున్నాడు. అతని పరిస్థితి కనుక్కుందామని అడిగాను—

"ఇప్పటి ఈగల సంగతి ఏమిటి?"

అతను నన్నుచూసి నవ్వాడు. ఆ నవ్వులో నామీద అతని ఆధిక్యత చూపించుకోదలచాడు.

"ఈగలా? వాటి గుణం చెప్పనా? వాటి రెక్కలకు గాల్లో ఎగిరే స్వభావం వుంది. పెద్దవాళ్లు చెపుతారు, ఆత్మలు కూడా అట్లాగే ఎగురుతాయని"

ఆత్మల విషయం ఎత్తేసరికి వెంటనే అడిగాను.




"ఓహో, అయితే ఇప్పుడు మీరు ఆత్మల కోసం వెదుకుతున్నారన్నమాట!"

నా ప్రశ్న అతన్ని తికమక పెట్టేసింది. గబగబా అడ్డంగా తలూపాడు. "అయ్యో, అదికాదు. నాకు ఆత్మలు అక్కర్లేదు. ప్రాణం కావాలి నాకు, అంతే. అయినా నేను మామూలు వాణ్ణి కాను. జంతు ప్రవృత్తి గల మనిషి కావాలనుకుంటే నువ్వు మరో పేషంటుని వెతుక్కో డాక్టర్" అన్నాడు.

అతని జవాబుకు నేను వులిక్కిపడ్డాను. అతని వాలకం చూసి అడిగాను "మిమ్మల్ని మీరు ఒక దేవుడిగా వూహిస్తున్నారనుకుంటా!"

దానికతను నవ్వాడు. "లేదు. నన్ను దేవుడితో పోల్చవద్దు" అన్నాడు. కాసేపు మళ్లీ ఆత్మల మీద సంభాషణ జరిగింది. చివరికతను "నాకు ఆత్మలు వద్దు పాడూవద్దు" అన్నాడు. అతని మొహ కవళిక మారింది. మౌనంగా వుండిపోయాడు. ఇక అతనితో మాట్లాడ్డం అనవసరం అనిపించింది. నేను తిరిగి వచ్చేసాను.

రెండోపూట అతను నాకోసం కబురుపెట్టాడు. మామూలుగా అయితే వెళ్లేవాణ్నికాదు, కానీ అతనిలో కొత్త కొత్త మార్పులు రావడం వల్ల వెళ్లాలనిపించింది. నాకు కూడా వేరే పని లేదు. జోనాథన్, ఆర్థర్, క్విన్సీమోరిస్ ఎవరి పని మీద వాళ్లు బయటకు వెళ్లారు. వాన్ హెల్సింగ్ రికార్డులన్నీ ముందువేసుకుని పరిశోధన చేస్తున్నాడు.

గది మధ్యలో రెన్‌ఫీల్డు స్టూలుమీద కూర్చుని వున్నాడు. నన్ను చూడగానే అడిగాడు "ఆత్మల గురించి ఏమిటంటావు?"

"మీరే చెప్పాలి" అన్నాను.

"నాకే ఆత్మలూ వద్దు" అన్నాడు.

"పోనీ ప్రాణాలున్నది కావాలా?"

"ప్రాణాలున్నది కావాలి. నాకది వుంది. దాని గురించి నువ్వేం బెంగపెట్టుకోకు" అన్నాడు.

"అవుననుకోండి. కానీ ఆత్మ లేకుండా ప్రాణం ఎలా వుంటుంది?" అడిగాను. దానికతను తికమకపడ్డట్టు కనిపించాడు.

"మీరు ఎన్నో ఈగల్ని, సాలెపురుగుల్ని,పక్షుల్ని, పిల్లుల్ని ఆత్మలరూపంలో కలుసుకుంటారు. వాటి ఆత్మలన్నీ మీ ఆత్మచుట్టూ తిరుగుతూ రొదపెడతాయి." మరింత తికమకపెడుతూ అడిగాను. అతనిలో ఏదో భయం పుట్టింది. చెవుల్లో వేళ్లు పెట్టుకుని; కళ్ళు మూసుకున్నాడు. అతని బుర్రలో ఏవో వూహలు వుండివుంటాయి.

"ఈగలకు పంచదార కావాలా? సాలెపురుగులు కావాలా? పోనీ ఏనుగును తెచ్చి ఇవ్వనా..." ఇట్లా ప్రశ్నలు వేసాను. అతనికి విసుగెత్తింది. "నాకు ఏమీవద్దు మొర్రో అంటే వినవేం? నన్నిలా వుండనివ్వు. నా మనసు ఏమీ బాగాలేదు. నన్ను సరిగా అర్థంచేసుకో డాక్టర్. అర్థంచేసుకోగలిగితే, నా పరిస్థితికి జాలిపడతావు" అన్నాడు. అతను మళ్లీ నిస్పృహతో పడిపోయేలా వున్నాడు. నేను తిరిగి వచ్చేసాను మళ్లీ.

అతనికి ఆత్మలంటే భయం. డ్రాకులా ఇతన్ని కలిసివుంటాడు. అయితే ఏదో కొత్త పథకం వుందన్నమాట.

(ఇంకా వుంది)

# హైదరాబాద్ నోట్‌బుక్

## తెలుగు ఇయర్ బుక్ ఆవిష్కరణ:

ముఖ్యమంత్రి శ్రీ ఎన్. టి. రామారావు ఏప్రిల్ 19న ప్రెస్ క్లబ్బులో డాటా న్యూస్ ఫీచర్స్ ప్రచురించిన తెలుగు, ఇంగ్లీషు వార్షిక దర్శినులను ఆవిష్కరిస్తూ, ఇలాటి పుస్తకాలలో ప్రకాశంపంతులు, వీరేశలింగం, అంబేద్కర్, సురవరం ప్రతాపరెడ్డి వంటి ప్రముఖుల జీవిత సంగ్రహాలు కూడ చేర్చడం అవసరమని సూచించారు. శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారే తనలో సేవా భావాన్ని ఉద్దీప్తం చేశారని, ఆ కారణంగానే తాను 1952లో రాయలసీమ క్షామనివారణ నిధి సేకరణకు పూనుకున్నానని ముఖ్యమంత్రి అన్నారు. ఈ ఆవిష్కరణోత్సవానికి అధ్యక్షత వహించిన ప్రఖ్యాత పత్రికా సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావు ప్రసంగిస్తూ, శ్రీ రామారావు భీష్మ పాత్రతో ప్రజల వద్దకు వెళ్లేటప్పుడు ఆయనలో సేవాభావం, యోగి మనస్తత్వం ఉట్టిపడుతాయని అన్నారు. తమకు రాష్ట్ర ముఖ్య మంత్రులయినవారందరూ సన్నిహితంగా తెలుసునని, కాని, శ్రీ ఎన్. టి. రామారావు వంటి సేవా మనస్తత్వం గల ముఖ్యమంత్రిని చూడలేదని శ్రీ నార్ల అన్నారు. తెలుగుదేశం పార్టీ వంద రోజుల పాలనపై కొందరు ముఖ్యంగా కాంగ్రెస్ పార్టీ నాయకులు చేస్తున్న విమర్శలను ఆయన ప్రస్తావించి, మూడు దశాబ్దాలుగా అధికారంలో వున్నప్పుడు కాంగ్రెస్ నాయకులు ఏమి చేశారని చాల విచారంతో ప్రశ్నించారు. డాటా న్యూస్ ఫీచర్స్ కృషిని ఆయన ప్రశంసిస్తూ, ఇలాటి కృషికి ప్రజలు, ప్రభుత్వమూ తోడ్పడాలని కోరారు. ప్రారంభంలో డాటా న్యూస్ ఫీచర్స్ సంపాదకులు శ్రీ వి. హనుమంతరావు స్వాగతం చెబుతూ, ఈ ప్రచురణ నాల్గవ సంవత్సరందని అన్నారు. అసోసియేటెడ్ ఎడిటర్ శ్రీ ఐ. వి. రామకృష్ణారావు డాటా న్యూస్ ఫీచర్స్ విశిష్టతను తెలిపారు. తమ సంస్థ సాంఖ్యక విద్యా, ఆర్థిక విషయాలను గురించిన సమాచారం అందిస్తున్నదన్నారు.

## ఆంగ్లంలో నారాయణరెడ్డి కవితలు:

ప్రాంతీయభాషలలో అపూర్వ కవితలు వెలువడుతున్నాయి. కవితలేకాదు, పరిశోధన లోను ప్రాంతీయభాషలు ఎంతగానో ప్రగతిని సాధించాయి. సంస్కృత సాహిత్యం గురించి, ముఖ్యంగా భాసకాళిదాస భవభూత్యాదులను గురించి తెలుగులో వెలువడినంత విమర్శ సాహిత్యం మరే భాషలోను వెలువడలేదని గట్టిగా చెప్పగలను. కాని ప్రయోజనం ఏమిటి? కుంభగత ప్రదీపంవలె ఆ కవితలు, ఆ పరిశోధనల వెలుగులు జిలుగులు తెలుగు ప్రాంతానికి మాత్రమే పరిమితమైపోయాయి. కారణం సంస్కృతాంగ్ల హిందీలలాగ తెలుగు సర్వజనీనం కాకపోవడమే. గురువర్యులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వంటివారి రచనలు ఆంగ్లంలోకి అనూదితాలై వుంటే, వారి పరిశోధన ప్రతిభ దిగంతాలకు పాకివుండేది. ఈ లోపాన్ని తెలిసిన కొందరు సహృదయులు తమ ఇష్టానిష్టాల ప్రసక్తి లేక తెలుగువారికి కీర్తి తెచ్చే తెలుగు రచనలను ఇతర భాషలలోకి, ముఖ్యంగా హిందీ ఆంగ్లాలలోకి అనువదించడానికి పూనుకున్నారు. అలాటి ప్రయత్నాలలో ఒక్కటి డాక్టర్ సి. నారాయణరెడ్డి రచనల ఆంగ్లానువాదం — 'సిగ్నేచర్స్ ఆన్ ది సీషోర్'. శ్రీ ఎస్. ఎస్. ప్రభాకరరావు అనువాదకులు. ఈ అనువాదం ఆవిష్కరణను ఏప్రిల్ 20న ఆంధ్ర సారస్వత పరిషత్తులో విద్యాశాఖామంత్రి శ్రీ పూసపాటి ఆనందగజపతిరాజు జరిపారు. ఈ సందర్భంలో విద్యాశాఖ మంత్రి ప్రసంగిస్తూ, ఆధునిక సాంకేతిక వైజ్ఞానిక పారిభాషిక పదాల నిఘంటువులు సిద్ధపరచడం అవసరమని, అప్పుడే తెలుగు స్వయం సంపూర్ణంకాగలదని అన్నారు. ప్రొఫెసర్ సత్యనారాయణసింగ్ ప్రసంగిస్తూ, డాక్టర్ నారాయణరెడ్డి వివిధ రచనలతో నేటి కవిగా రూపొందాడని, ఆయన రచనలు యువకులకు వెలుగుబాటలని అన్నారు. ప్రొఫెసర్ అడపా రామకృష్ణారావు ప్రసంగిస్తూ, మధ్యతరగతివారి బాధలను చిత్రించిన కొందరిలో డాక్టర్ నారాయణరెడ్డి ఒకరిని, మధ్యతరగతి మనిషి తన పరిసరాలలో జరిగే సంఘటనలను పట్టించుకోకుండా పరమహంసలాగ ప్రవర్తిస్తున్నాడనే ఆందోళన వ్యక్తం చేసినవారు నారాయణరెడ్డేనని రామకృష్ణారావు అన్నారు. అనువాదకులు శ్రీ ప్రభాకరరావు ప్రసంగిస్తూ, భారతదేశంలోని ప్రాంతీయ భాషలలో ఎంతో అపూర్వమైన రచనలు వెలువడుతున్నాయని, ఇతర భాషలలో ఎంతటి ప్రగతి జరుగుతున్నదో సకల భాషల వారికి తెలియడానికి వాటిని ఆంగ్లంలో అనువదించడం అవసరమని అన్నారు. డాక్టర్ నారాయణ రెడ్డి ప్రసంగిస్తూ, తెలుగులో కవితలను కొని చదివేవారు చాల తక్కువని అన్నారు. తెలుగులోని ఉత్తమ రచనలను ఆంగ్లంలోకి అనువదించడానికి పూనుకున్న ప్రభాకరరావు దీక్షను ఆయన ప్రశంసించారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ అధ్యక్షులు శ్రీ దేవులపల్లి రామానుజరావు ఆవిష్కరణ సభకు అధ్యక్షత వహించారు.

## చింతచిగురు!

చింతచిగురు చాల రుచ్యమైనది. ఇది తెలుగు జానపద కవితకేకాక ప్రాచీన ప్రాకృత కవితకు కూడ ఎక్కింది. చింత మావిచిగురు చూడు చిన్నదానివలపుచూడు—అనే జానపద గీతి భాగం ప్రతి తెలుగువాడికి తెలిసిందే. ఈ తరుణి లావణ్యం చింతచిగురులాగ నోరు ఊరిస్తుంది—అన్నారు ప్రాకృత కవి వజ్జాలగ్గగారుడు. చింత చెట్టును గురించిన సామెతలకు ఇక కరువులేదు. దానికేముమ్మా, చించెట్టు కాపురం — అంటారు పచ్చగా కాపురం చేస్తున్న ఇల్లాలిని. చింతచెట్టు పాల్గుణంనుంచి మరుసటి పుష్యంవరకు, చిగురు, లేతకాయలు, దోరగాయలు, పండుకాయలులాగా దాదాపు సంవత్సరమంతా లాభసాటిగానే వుంటుంది. కాలానికి చింతలు, కరువుకు మామిళ్లు — అనేది తెలంగాణాలో ఒక ప్రాంతం సామెత. చింతచెట్టు బాగావుంటే, బాగా పండితే, వానలు బాగా కురిసి సుభిక్షంగా వుంటుందని, మామిడిపంట బాగా పండితే తర్వాత వర్షాలు పడక కరువు కాటకాలు ఏర్పడుతాయని దీని భావం. చింతచిగురు తక్కిన తెలుగు పదాలు బుట్ట, గంపలలాగే దక్కినీ ఉరుదూ చేరింది. ''క్యా క్యా పకాయే కనా, చింతచిగురు బైంగనా'' అని కవిత చెప్పారు డాక్టర్ జీనత్ ఆపా (నిజాం కాలేజీ). ఈ చింతచిగురు జంటనగరాల మార్కెట్లలోను సంచార కూరగాయల దుకాణాలలోను గ్రాహకులను విశేషంగా ఆకర్షిస్తున్నది. చింత చిగురు సామాన్య ప్రజానీకం రుచ్యవ్యంజనం. చింతచిగురుతో పచ్చడి, పప్పు, పొడి, పోపుపెట్టిన పొడికూర, పులిహోర, ఎండించి నూవులువేసి పొడి, బాగా నూరి వడపోసి పానీయం, పానీయాన్ని ఉడికించి చారు, ఆధునిక పద్ధతిలో జల్లీ, సన్నగా తరిగి, పచ్చికొబ్బర, పచ్చిమిరపకాయలు వేసి కోసుంబరి మొదలయినవి చేసుకొని ఆనందించ వచ్చు. చింతపండు షర్బతు ప్రసిద్ధం. చింత పండును అరబ్బులు తమరే—హింద్—భారతదేశపు ద్రాక్ష — అన్నారు. దీనిని షర్బత్తు చేసుకొని తెగ తాగేవారట పూర్వం. ఆ తమరే హింద్ పదమే,యూరోపియనుల నోళ్లలోపడి టామరిండ్ అయింది.

## ఉపశ్రుతి:

''అటు పంజాబీలు, ఇటు నాగాలు, అటు మరొకరు కేంద్రాన్ని బెదిరిస్తున్నారే. చివరకు ఏమౌతుందంటారు?'' అనడిగారొకరు. ''పిల్లి గుడ్డిదైతే ఎలుక గడ్డి పెట్టిందట — అన్న సామెత ఉండనే ఉందిగదా!'' అన్నారు మరొకరు సమాధానంగా.

— తిరుమల రామచంద్ర *

# ప్రపంచ ప్రసిద్ధ (?)

## విమల్‌కి 6 జాతీయ అవార్డులు!

ఈ సంవత్సరం విమల్ ఉత్తమ ప్రకటనలకు ఆరు జాతీయ అవార్డులను గెలుచుకుంది. రంగుల ప్రకటనకు, సింగిల్ షీటు కేలండరుకు ప్రథమ బహుమతులు పొందింది. వార్షిక నివేదికకు రెండవ బహుమతి, షూటింగ్ పోస్టరుకు టెక్స్‌విన్ యార్న్ ఫోల్డరుకు మెరిట్ సర్టిఫికేట్లు లభించాయి.

అడ్వర్‌టైజర్ వ్యవహారాలను చూసే ముద్రా కమ్యూనికేషన్స్ డిజైనింగ్‌కు నాలుగు అవార్డులను సంపాదించింది. విమల్ ఫాబ్రిక్ ఉత్పత్తిదార్లకు రెండు అవార్డులు లభించాయి.

వరుసగా నాలుగు సంవత్సరాలుగా విమల్ జాతీయ అవార్డులను గెలుచుకుంటోంది.

## శ్రీకాకుళంలో రావి కొండలరావుకి సన్మానం

ప్రముఖ హాస్య నటుడు, రచయిత, పత్రికా రచయిత శ్రీ రావి కొండలరావు 200 చిత్రాలు పూర్తిచేసిన సందర్భంగా మార్చి 19న శ్రీకాకుళంలో అభినందన సభ జరిగింది. శ్రీ తమ్మిరాజు భానుమూర్తి స్వాగతం పలికారు. రాష్ట్ర శాసనసభ స్పీకర్ శ్రీ తంగి సత్యనారాయణ సభని ప్రారంభించారు. మున్సిపల్ ఛైర్మన్ శ్రీ ఎ. వి. నరసింహం, జిల్లా కలెక్టరు శ్రీ జె. హరినారాయణ, పోలీసు సూపరింటెండెంట్ శ్రీ శివశంకర్, పార్లమెంటు సభ్యుడు శ్రీ బి. రాజగోపాలరావు, శ్రీ రమణయ్యరాజా, ప్రముఖ రచయిత, నటుడు శ్రీ గొల్లపూడి మారుతీరావు, ప్రముఖ దర్శకుడు శ్రీ కమలాకర కామేశ్వరరావు, శ్రీ టి.వి.కె. శాస్త్రి (కళాసాగర్, మద్రాసు) రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాల డైరెక్టరు, నటుడు శ్రీ జె.వి. సోమయాజులు ముఖ్య అతిథులుగ విచ్చేశారు.

సభా ప్రారంభానికిముందు శ్రీ రావి కొండలరావు దంపతులకి, ముఖ్య అతిథులకి మంగళవాద్యములతో, పూర్ణ కుంభంతో వేదోక్తంగా స్వాగతం చెప్పారు

శ్రీ కొండలరావు తమను చిత్ర రంగానికి పరిచయం చేసిన శ్రీ కమలాకర కామేశ్వరరావుగారిని సన్మానించి గురుపూజ చేశారు.

అభినందన కమిటీ తరఫున శ్రీ టి. వి. కె. శాస్త్రి సారథ్యంలో శ్రీ తంగి సత్యనారాయణ, రావి కొండలరావు దంపతులని ఘనంగా సన్మానించారు వివిధ సాహితీ, సాంస్కృతిక, సంఘ సేవా సంస్థలు పూలమాలలతో సత్కరించాయి. అభినందన సంచికని శ్రీ రమణయ్యరాజా ఆవిష్కరించారు. శ్రీ కె మురళీమోహన్ వందన సమర్పణ చేశారు.

అనంతరం సినీ నేపథ్య గాయకుడు శ్రీ ఆనంద్ బృందం లలిత సంగీత కచేరి, శ్రీ ప్రసాద్ బృందం ప్రదర్శించిన డిస్కో నృత్య సంగీతాలు ప్రేక్షకులని అలరించాయి. ★


**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3**

**Editor : S Radhakrishna**

# కళ్లు...









## వాటిలో భావాలొలికించండి

నవ్వు. సంతోషం. కోపం. విచారం. ఈ భావాలన్నిటినీ కళ్లు మరింత ప్రస్ఫుటంగా వ్యక్తం చేయగలవు...శింగార్ డీలక్స్ కాటుకతో. ఇది మరింత నల్లనిది, మరింత నిగనిగలాడేది. ఎంతో చల్లనిది! ప్రత్యేకంగా రూపొందించబడింది, అంచేత కళ్లకు మంట పుట్టించకుండా అందాలన్నీ చిందిస్తుంది.




**శింగార్**
డీలక్స్ కాటుక

కళ్లకు మంచిదైన ఒకే ఒక కంటి సౌందర్య సాధనం.

everest/83/SH/179-tl

# క్లియర్-టోన్

## వాడి సంతృప్తి చెందిన వాళ్లు, దాని గురించి ఏమంటున్నారో వినండి!

"నా వంటి ఛాయ ఎంతో మెరుగు పడిందని అంది మా వదిన. ఆమె నుంచి అటువంటి ప్రశంస రావడం నిజంగా గొప్పే!"
—డైసీ నామ్‌దార్
రంగస్థల నటి





"నాలుగు వారాలుగా నేను క్లియర్-టోన్ వాడుతున్నాను. నా మచ్చలు దాదాపుగా పోయాయి."
—శిరీన్ నాఘు పటేల్
విద్యార్థి

"నా పని వల్ల నేను ఎండలో తిరగాల్సి వస్తూంటుంది. కాని ఈ మధ్య నేను నల్లబడటం లేదని గ్రహించాను. అది క్లియర్-టోన్ మహత్యం మరి."
—పౌలెట్ సల్డానా
మార్కెట్ రిసెర్చర్





"క్లియర్-టోన్ నా చర్మాన్ని మరింత మృదువుగా చేసింది— నా మోచేతుల్ని కూడా!"
—రాజం రాజామణి
గృహిణి

## వంటిఛాయ మెరుగుపరిచే తిరుగులేని క్రీమ్

ఇవి, క్లియర్-టోన్ వాడి ప్రయోజనం పొందిన వేలాదిమందిలో కేవలం పదుగురి అభిప్రాయాలు మాత్రమే. క్రీములు, లోషన్లు మూలికా ఔషధాలు మొదలైన వెన్నో వాడి చూశారు వాళ్లు. కాని ఏదీ పని చెయ్యలేదు. తర్వాత వాళ్లు కనుక్కున్నది క్లియర్-టోన్ వంటి ఛాయని మెరుగుపరిచే తిరుగులేని క్రీమ్.

క్లియర్-టోన్ క్రీమ్ అంతర్జాతీయ ఔషధ పరిశోధనా ఫలితం. దీన్ని అందిస్తున్నవారు నికొలాస్ లాబరేటరీస్ ఇండియా లిమిటెడ్. క్లియర్-టోన్ శాస్త్రీయంగా స్వీకరించబడినది. భారతదేశంలో దొరికే మరే ఇతర క్రీములలోనూ లేని వంటిఛాయ - మెరుగుపరిచే ఒక ప్రత్యేక పదార్థం దీనిలో ఉంది.

క్లియర్-టోన్ మీ చర్మం మీద సహజమైన రీతిలో పనిచేసి, కొన్ని వారాల్లోనే దాని ఛాయని మెరుగుపరుస్తుంది. మచ్చల్నీ, మరకల్నీ పోగొడుతుంది. మీ వంటి ఛాయని ఆరోగ్యంగా మెరిపిస్తుంది.

అన్నిటికంటె ముఖ్యంగా, క్లియర్-టోన్‌లోనే వుండే తేమనిచ్చే ఒక ప్రత్యేక పదార్థం, మీ చర్మాన్ని అన్ని కాలాల్లోనూ నున్నగా, కోమలంగా ఉంచుతుంది— ఎండగా వున్నా, చలిగా వున్నా లేదా పొడిగా వున్నా, వర్షంగా ఉన్నా.

ఈ రోజునుంచే మార్చండిక— ఇకమీదట క్లియర్-టోన్ వాడటం ప్రారంభించండి. మచ్చలేని మెరుగైన వంటిఛాయకోసం, అది అలాగే నిలిచి ఉండటం కోసం. ఎందుకంటే, ఎండలోని నల్లబరిచే అల్ట్రావయొలెట్ కిరణాలనుంచి కూడా మీ చర్మానికి రక్షణ ఇస్తుంది క్లియర్-టోన్

ప్రపంచమంతటా గల లక్షలాది అందమైన వ్యక్తులు ఇచ్చే సలహా పాటించండి. రోజూ వాడండి క్లియర్-టోన్.






Clear·tone
the perfect fairness cream
Makes you fairer, keeps you fairer, naturally
LONDON • PARIS • NEWYORK

మెరుగైన ఫార్ములా
తిరుగులేని ఫలితం

మెరుగైన వంటిఛాయలోని రహస్యం—సహజమైన రీతిలో

క్లియర్-టోన్
లండన్ • పారిస్ • న్యూయార్క్